# ఆత్మ లింగార్థము



రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org







# ఆత్మ లింగార్థము

(అచేల సాంప్రదాయము)

రచయిత : త్రిమత ఏకైక గురువు
ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, 94 వ గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

## శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు




ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd. in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము–39 ఆరవ ముద్రణ : జనవరి–2018

ప్రతులు : 1000 **వెల : 110 /-**

## "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు-దేవుని తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర
41) భావము-భాష
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన
77) ద్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు)
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) ఏది సత్యము-ఏది అసత్యము.
90) ఒక వ్యక్తి రెండు కోణములు.
91) అంతిమ దైవగ్రంథములో వజ్రవాక్యములు.
92) బ్రహ్మ-రావణ బ్రహ్మ-భగవాన్ రావణ బ్రహ్మ.
93) ద్వితీయ దైవగ్రంథములో రత్న వాక్యములు.
94) హిందూ ధర్మములో రక్షణ అవసరమా?
95) మనిషికి వేదము అవసరమా?
96) మానవత్వము.
97) సుప్రసిద్ధి బోధ.
98) రూపము మారిన గీత.
99) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
100) రాజకీయము×రాజకీయము.
101) ఉగ్రవాదము స్వర్గము కొరకే.

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నాం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?
79. కర్మ మర్మము.

80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము.
125. అక్షర జ్ఞానము.
126. లలా జలము.
127. దైవ ధర్మములు-మత సాంప్రదాయములు
128. ఆహారము నీకా! నీ ఆత్మకా!!
129. మాత్ర-మందు.
130. కాలచక్రం.
131. బ్రహ్మవిద్య.
132. శక్తి.
133. పౌర్ణమి-అమావాస్య.
134. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

---

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్రెసిడెంట్)
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ** (సూర్య మీ సేవా)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక** (Head Office)
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు** (ప్ర.సభ్యుడు)
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు** (టీచర్) (ప్రెసిడెంట్)
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

# ఇందూ జ్ఞానవేదిక ఆధ్యాత్మిక ప్రచురణలు లభించు చిరునామా



**డి. వరుణ్ కుమార్ శ్రేష్ఠి** (ప్రెసిడెంట్)
పులివెందుల , కడప (జిల్లా).
Cell : 9293199539, 9985714382

P.M.H **నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

P. **రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, కోయిలకుంట్ల (మం),
కర్నూలు (జిల్లా) Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్) MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
దర్గామాన్యం, గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి** (ప్రెసిడెంట్)
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు** (టీచర్) (ప్రెసిడెంట్)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**



**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హోస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# రచయిత ముందు వ్రాత

ఈ గ్రంథములోని పద్యములు అచేల సాంప్రదాయమునకు చెందినవి. ఈ అచేల సాంప్రదాయమెక్కడిదని కొందరికి ప్రశ్నరావచ్చును. మేము చెప్పు **"అచేలము"** పూర్వముండెడిది. ఆనాటి అచేలమే ఈనాడు **"అచలము"** అనుపదముగా మారిపోయినది. అచేలమనగా అర్థము గలదు కాని అచలము అనగా అర్థమే లేదు. ఈనాడు అచల సాంప్రదాయులు చాలామంది గలరు. మాది అచలపీఠమని ప్రత్యేకముగా పీఠమునేర్పరచు కొన్నారు. ఒక రోజు అచల పీఠగురువు మాతో కలసినపుడు ఆయనను పరిచయము చేసుకొనుచు, మేము అచల పీఠగురువులమని చెప్పారు. అపుడు అచలము అంటే ఏమిటని మేము అడిగాము. అచలము అనగా చలనము లేనిదని ఆయన జవాబిచ్చాడు. అట్లయితే అచలనము అనాలి, కానీ మీరు అచలము అంటున్నారు. అచలములో **"న"** లేకుండా పోయినదని గుర్తు చేశాము. ఆ మాటకు ఆ గురువు గారు కొంత తికమకపడ్డారు. సరైన జవాబు ఆయనవద్ద లేకుండా పోయినది. ఒక పెద్ద ఆధ్యాత్మిక పీఠము యొక్క పేరే అర్థము లేనిదై ఉండడము మాకు చాలా ఆశ్చర్యమును కల్గించినది. అచలమంటే ఏమిటి? దాని నిజ స్వరూపమేమిటను విషయమును ప్రజలకు తెలియబరుచు ఉద్దేశ్యముతో **"ఆత్మలింగార్థము"** అను ఈ గ్రంథమును వ్రాయడము జరిగినది. ఈ గ్రంథములోని పద్యములు మేము వ్రాసినవి కావు. కానీ పద్యములకు భావములన్నియూ మేము వ్రాసినవే. పద్యములలో కూడా అచలము అను పదమునే వాడియుండుట ఆశ్చర్యము. మా భావములలో మాత్రము మేము అచలము బదులు అచేలము అని వ్రాశాము. అచేలము అనగా బయలు అని అర్థము. పరమాత్మను ఏమికాని బయలుగా వర్ణిస్తూ చెప్పడమే కొందరి ఉద్దేశ్యమై నందున పూర్వము **"బట్టబయలు"** అను పదమునకు సరిపడు అర్థముతో అచేలము అన్నారు. **అచేలము** అను పదము యొక్క అర్థము సారాంశము ఏమిటో సవివరముగా ప్రక్క పేజీలో చూస్తాము.

కలియుగములో తయారయిన అనేక దేవాలయములలో శ్రీరంగ పట్టణములోని శ్రీరంగని ఆలయ సమీపములో చిదంబర రహస్యమనునది కలదట. అక్కడకు పోయినవారు శ్రీరంగని దేవాలయము దర్శించిన తరువాత చిదంబర రహస్యమును చూచుట పరిపాటి. కానీ ఇది రహస్యమనీ, దానిని ఎవరికీ చెప్పకూడదని అక్కడి పెద్దలు చెప్పి, మిగతా వారికి చూపడము జరుగుచున్నది. రహస్యమనునది చెప్పకూడనిది, చూపకూడనిది ఐనప్పటికి చెప్పకూడదని చూపడములో ఏమి రహస్యము గలదో, అక్కడ ఎవరికీ తెలియని ఏదో ఒక విషయముండి తీరాలి అందువలననే దానిని రహస్యమంటున్నాము. చిదంబర రహస్యమును చెప్పినా బోధపడనిది, చూచినా అర్థముకానీ విషయము కావున దానిని చిదంబర రహస్యమన్నారు. చాలామందికి **"చిదంబర"** మను పేరు వివరము తెలియదు. **చిద అనగా వస్త్రము, అంబరము అనగా ఆకాశము.** ఈ విధముగా చిదంబరము అను పదములో వస్త్ర ఆకాశము మరియు బట్ట బయలు అని అర్థము గలదు. "చిదంబర రహస్యము బట్ట బయలు" అను వాక్యము కూడా కలదు. శ్రీరంగ పట్టణములోని చిదంబరమేమిటో కొంత తెలుసుకొందాము.

భగవద్గీత సాంఖ్య యోగమను అధ్యాయములో 22వ శ్లోకము నందు భగవంతుడు **"వాసాంసి"** అను పదమును ఉపయోగించి శ్లోకము చెప్పాడు. ***"వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోపరాణి తథా శరీరాణి విహాయ జీర్ణా నన్యాని సంయాతి నవాని దేహి"*** ఇందులో **"పాత వస్త్రము వదలి కొత్త వస్త్రము ధరించినట్లు, పాత శరీరమును వదలి క్రొత్త శరీరమును జీవుడు ధరిస్తున్నాడని"** చెప్పాడు. ఇక్కడ శరీరమును గుడ్డతో పోల్చి చెప్పాడు. వస్త్రము అనినా బట్ట అనినా చేలము అనినా ఒకటే అర్థము. అలాగే అంబరము అనినా, ఆకాశము అనినా బయలు అనినా ఒకే అర్థము. శ్రీరంగ దేవాలయములో ఉన్న చిదంబర

రహస్యమనునది ఏమిటని పరికించి చూచిన అక్కడ ఒక ద్వారమునకు అడ్డముగా వస్త్రమును వేలాడదీసి ఉందురు. ద్వారము లోపల ఏమున్నది కనిపించనట్లు ఆ వస్త్రము కట్టబడి ఉండును. లోపల ఏమున్నది తెలియదు కావున అదియే రహస్యము. లోపల ఏమున్నదో చూడాలనుకొన్నవారు అక్కడున్న వారిని అడిగి అనుమతి తీసుకోవలసి ఉంటుంది. చూడాలను కొనువారికి చూపించు వారుందురు. వారు చూచువారికి 'ఇక్కడ చూచినది రహస్యము కావున ఎవరికీ చెప్పకూడదని' చెప్పి చూపించుచుందురు.

ఎందరో చిదంబర రహస్యమును చూచినప్పటికీ చూడకమునుపు ఉన్న ఆత్రుత చూచిన తర్వాత లేదు. ఎందుకనగా చూడవలెననుకొనువారు చూడకముందు రహస్యమును, అనగా చూడదగిన దానిని గురించి ఏదో ఊహించుకొని ఉందురు. ఎవరేమి ఊహించుకొన్నప్పటికీ గుడ్డ తొలగించు తూనే ఎవరికీ ఏమీ కనిపించకపోవడమే ఆశ్చర్యము. అక్కడ ఒక ద్వారము, దానికి అడ్డముగా ఒక గుడ్డ ఉండుననుకొన్నాము కదా! చూడవలసిన వారిని ద్వారము ముందర నిలబెట్టి గుడ్డ తీసి చూపుదురు. గుడ్డతీసి చూడగనే అక్కడ ఏ వస్తువుగానీ, ఆకారము గానీ లేకపోవడము ఆశ్చర్యమే అగును. పై కప్పులేని ఆకాశము మాత్రము కనిపించును. గుడ్డ తీసి అక్కడ ఏమి లేదే అన్నట్లు చూపించువారినడగగా ఆకాశము వైపు చూపించి ఇక్కడ మీరు చూడవలసింది కనిపించునది ఇదేనని చెప్పుదురు. ఏమీ లేనిదే చిదంబర రహస్యము. ఇక్కడ ఏమీ లేనట్లు చెప్పితే ఎవరూ రారు కనుక మీరు దీనిని రహస్యముగా వుంచి ఎవరికీ చెప్పకూడదని తెలుపుదురు. చెప్పితే ఏమగునో, ఏ చెడు జరుగునోయని చూచివచ్చినవారు కూడా చెప్పకుండుట జరుగుచున్నది. అక్కడ ఆచారమున్నా అర్థము లేకుండా పోయినది. ఆధ్యాత్మికపరమైన పరమార్థికమైన అర్థము చెప్పుకోక, ఇక్కడ చూచినది ఎవరికీ చెప్పవద్దనడము పొరపాటు. ఎవరు ఎవరికి చెప్పినా

చిదంబరము అనునది రహస్యమను అర్థముతోనే ఉండును. ఇటువంటి రహస్యముందని చూపు విధానమే 'చిద' 'అంబరము'.

జీవుడు శరీరములోనున్నంత వరకు మోక్షము చెందలేడు. కర్మ లేకుండా చేసుకొని శరీరమును పొందకుండా పోయినపుడు పరమాత్మ లోనికి ఐక్యమైపోవును. ఇటు శరీరము అటు మోక్షము రెండే గమ్యములు జీవునికి గలవు అనునది సత్యము. శరీరమున్నంత వరకు దేవుడు తెలియడు. చావు పుట్టుకలుగల శరీరము దేవునికి నీకు మధ్యలో అడ్డముగా నున్నది. పుట్టుకతో మొదలై చావులో అంత్యమై తిరిగి వెంటనే పుట్టుకతో శరీరము జీవునకు తగులుకొనుచున్నది. **"శరీరము గుడ్డలాంటిదని, పాత గుడ్డ పోతూనే క్రొత్త గుడ్డ తగులుకొనుచున్నదని"** గీతలో దేవుడు చెప్పాడు. అందువలన ఆ గుడ్డ లేకపోతే నీవు దేవుని వద్దకు చేరవచ్చని, శరీరమును గుడ్డగా, పరమాత్మను బయలుగా చూపించారు. శరీరమును బట్ట అనీ, పరమాత్మను బయలుయనీ, శరీరమును పరమాత్మను బట్ట బయలుగా పోల్చారు. బట్ట తీసినపుడే బయలు కనిపించుననీ, శరీరము లేనపుడే దేవుడు తెలియుననీ తెలుపునదే **చిదంబర రహస్యము**. బాహ్యార్థముగా బట్టను బయలును చూచినప్పటికీ శరీరధారులైన జీవులు పరమాత్మను తెలియకున్నారని చెప్పుటకే తెలియనిది రహస్యమని చిదంబరమునకు రహస్యమను పదము చేర్చినారు. ఆ వివరము తెలియక ఇది రహస్యము ఎవరికీ చెప్పకూడదనుటలో అర్థము లేదు. 'చేలము' అనగా సమత శరీరము అనుకొన్నాము కదా! చావుతో పోవు శరీరము ఆ క్షణమే పుట్టుకతో జీవునికి తగులుకొనుచున్నది. కావున ఎల్లపుడూ బయలుగా పోల్చబడిన పరమాత్మకు చేలముగా పోల్చబడిన శరీరము అడ్డముగానున్నదని తెల్పుటకే శ్రీరంగము లోని చిదంబరమని తెలియాలి. గుడ్డ అడ్డముండగా అవతలనున్న బయలు ఎప్పటికీ కనిపించదని తెలుపుచూ మీకు శరీరమను చేలము అడ్డము

ఉన్నందున, బయలను పరమాత్మ తెలియడని తెల్పు నిమిత్తము 'రహస్యము' అనడములో అర్థముగలదు.

బట్ట తీస్తే బయలు, బట్ట తీయకపోతే బయలు లేదు. అలాగే శరీరము పోతేనే మోక్షమని తెల్పుచూ బట్టలేని స్థితియైన దానిని అచేలము అన్నారు. చేలము అనగా గుడ్డ, అచేలము అనగా శరీరము లేని మోక్షమని చెప్పారు. అజ్ఞానములో ఉండి శరీరముతో జన్మలెత్తుచున్న వారిని చేలురని, జ్ఞానము కల్గి జన్మలేని స్థితిని కోరుచున్నవారిని అచేలురని పూర్వము పెద్దలనెడి వారు. శరీరమును చేలమని, మోక్షమును అచేలమని పూర్వము అనెడివారు. మోక్షమార్గమును అచేలమని, అజ్ఞానమును చేలమని కూడా పిలిచెడివారు. జ్ఞానమార్గమైన **అచేలమను** పదము కాలక్రమమున **అచలముగా** మారినది. జ్ఞానమార్గమనుసరించువారు నేటికీ ఉన్నారు. కానీ వారు మాది అచలము అనడము అర్థములేని మాట. వారు మాది అచేలము అని చెప్పవచ్చును కానీ అచలమని చెప్పకూడదు.

ఈ గ్రంథములో అచేలమునే కాక ప్రపంచములోని అజ్ఞాన ప్రజలను గురించి, జ్ఞానుల గురించి, గురువుల గురించి చెప్పడమైనది. అంతేకాక జ్ఞానసాధనా పద్ధతులను జ్ఞానుల పట్ల మూర్ఖులుండెడి పద్ధతులను కూడ తెలియజేయడము జరిగినది. మానవునికి కావలసిన జ్ఞానమును వరుసగా చెప్పుచూ చివరికి అచేలమయిన పరమాత్మను గురించి వర్ణించి చెప్పడము జరిగినది. కపట గురువులను, కపట శిష్యులను గురించి చెప్పడమే కాక నిజగురువు యొక్క విలువను కూడా చెప్పడమైనది. ఈ గ్రంథము జిజ్ఞాసులైన వారికి జ్ఞానమార్గములో అన్ని విధములా ఉపయోగ పడగలదని భావిస్తున్నాము.

ఇట్లు

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

దేవుడు మనిషి యొక్క గమ్యము. ఆ గమ్యమునే ముక్తి అని కూడా అంటున్నాము. ముక్తి కొరకు మనిషి దేవుడిని తెలియు మార్గములను ఏర్పరచుకొన్నాడు. దేవున్ని అన్వేషించు మార్గములలో ప్రస్తుత కాలములో ఇందూమతములో అద్వైతము, ద్వైతము అను రెండు పద్ధతులు ప్రచారములో గలవు. వాటితో పాటు వాటికి కొంత విభిన్నమైన **"అచలము"** అను పద్ధతి కూడా కొంత ప్రచారములో గలదు. ఒక మనిషి ఆధ్యాత్మికములో ఉన్నాడంటే అతను అద్వైతమును గానీ, ద్వైతమును గానీ, రెండూ కాకపోతే అచలము గానీ అనుసరిస్తుండును. అచలము అను పద్ధతి కొంత అద్వైతమునకు దగ్గర పోలిక ఉన్నప్పటికీ ద్వైతమునకు పూర్తి విభిన్నముగానే ఉన్నది. మనిషి దేవున్ని తెలియుటకు అనుసరించు మార్గములైన ద్వైత అద్వైతములు, అచలముకాక అన్నిటికీ ఆశ్చర్యమును కలిగించుచు **"త్రైతము"** అను మార్గము కనుగొనబడినది. ద్వైత, అద్వైత, అచలములలో లేని శాస్త్రబద్ధత త్రైతములో ఉండడము విశేషతని చెప్పవచ్చును.

అద్వైతమును ఆది శంకరాచార్యుడు ప్రకటించగా, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించారు. **త్రైతసిద్ధాంతము ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరుల చేత ప్రకటితమైనది.** ఇక అచలమును ఎవరు ప్రకటించారో సరియైన సమాచారము లేదు. అచల సాంప్రదాయ నిర్మాతల పేర్లు రెండు మూడు వినిపిస్తుండడము వలన ఖచ్చితముగా ఎవరు స్థాపించారో తెలియకుండా పోయినది. ఇప్పుడే పుట్టిన త్రైతము చిన్న మొక్క స్థితిలో ఉండగా, వందల సంవత్సరముల పూర్వము పుట్టిన అద్వైత, ద్వైతములు, అచలము వేళ్ళూనిన వృక్షములలాగా ఉన్నవి. ద్వైతమునకు, అద్వైతమునకు కొంత అర్థము ఆచరణలు గలవు. అద్వైతులు ఆచరణలో విభూతి ధరించగా, విశిష్టాద్వైతులు మూడు నామములను ధరించుచున్నారు.

అద్వైతులు పంచాక్షరి మంత్రమంటే, విశిష్టాద్వైతులు అష్టాక్షరి మంత్రము అంటున్నారు. అచలములోనికి వస్తే అచలము అను పదమునకు అర్థము గానీ, ఆచరణ గుర్తింపుగానీ లేకుండుట వలన కొందరు విమర్శించుటకు అవకాశము గలదు. పూర్వము అచలమును ప్రతిపాదించిన పెద్దలది మంచి ఉద్దేశమే అయివుండి, ప్రజలు సంపూర్ణజ్ఞానులు కావలెనను తపన వారికుండెడిది. కాలగమణములో అచలముగ తయారయిన పదము పూర్వకాలములో అచేలముగ ఉండి, ఎంతో అర్థముతో కూడుకొని ఉండెడిది. దాని గొప్పతనమును నేటికాలములో కోల్పోవడము కొంత బాధకరమైన విషయము. కావున దాని అర్థమును దానికి చేకూర్చు ప్రయత్నమే మా ఈ రచనలోని ముఖ్య ఉద్దేశము. మేము త్రైతసిద్ధాంతులమైనప్పటికీ అచలము యొక్క పూర్వ ఉద్దేశమేమో మాకు తెలుసును. కావున ఆ విషయమునే ఈ గ్రంథములో వ్రాయడము జరిగినదని తెలుపుచున్నాము.

ఇట్లు

**త్రిమత ఏకైక గురువు, త్రైత సిద్ధాంత ఆదికర్త, శతాధిక గ్రంథకర్త**

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

# ఆత్మ అంటే ఎవరు

మన శరీరములో మూడు ఆత్మలు గలవు. అవియే క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు. ఈ గ్రంథములో ఆ ముగ్గురు పురుషలను జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అని చెప్పడము కూడా జరిగినది. ప్రతి పద్య భావము మొదటిలో ఒకటవ ఆత్మయిన జీవాత్మ రెండవ ఆత్మయిన ఆత్మను సంబోధిస్తూ భావమును మొదలు పెట్టడము జరిగినది. ప్రతి భావములో

సంబోధనకు ముందే ఆత్మయొక్క స్థితి, గొప్పతనము, పద్ధతిని గూర్చి చెప్పుచూ ఓ ఆత్మా! వినుము అనడము జరిగినది. ప్రతి సంబోధన ముందర ఆత్మను గురించి చెప్పిన వాక్యములు ఆత్మ యొక్క నిజస్వరూపమును చూపుచున్నవి. ఇంతవరకూ ఆత్మను గురించి చెప్పిన వాక్యములు ఎక్కడా లేనందున ఈ గ్రంథములో ఆత్మ ఔన్నత్యమును పాఠకులు గుర్తించుటకు వాటిని ఇక్కడ ప్రత్యేకముగా పొందుపరచడము జరిగినది. అన్నిటినీ ఒక్కమారు వరుసగా చదువుట వలన ఇంతవరకూ ఎక్కడా గుర్తింపబడని రెండవ ఆత్మ విషయము కొంతయిన అవగాహనకు రాగలదని భావించు చున్నాము.

1. సమస్త జీవరాసులందు కలసియున్న ఓ ఆత్మా! వినుము.
2. అఖిల జీవులందు ఒకే చైతన్యముగనున్న ఓ ఆత్మా! వినుము.
3. గాలిలో గంధము కలసి కనిపించనట్లు, శరీరములో కంటికి కనిపించక ఉన్న ఓ ఆత్మా! వినుము.
4. సాక్షివై అన్నీ జీవులందున్న నాలోని ఆత్మా! వినుము.
5. శక్తి రూపములో శరీరమంతయూ వ్యాపించియున్న ఓ ఆత్మా! వినుము.
6. సమస్త జీవులందు కార్యరూపమై ఉన్న ఓ ఆత్మా! నామాట వినుము.
7. సమస్త జీవులందు చైతన్యముగానున్న ఓ ఆత్మా! వినుము.
8. మూడు ఆత్మలలో రెండవదైన ఓ ఆత్మా! వినుము.
9. అఖిల జీవరాసులందు అన్ని పనులు చేయిస్తున్న ఓ ఆత్మా! వినుము.
10. సమస్త జీవరాసులందు చైతన్యరూపమై ఖండ ఖండములుగా శరీరములో వ్యాపించి ఉన్న ఓ ఆత్మా! వినుము.
11. సర్వ జీవరాసులందు నివశిస్తూ, ఆయా శరీర ఆకారము కల్గియున్న ఓ ఆత్మా! వినుము.

12. శరీరమను గుడిలో దీపమై శరీరమంతటికీ వెలుగునిచ్చుచున్న ఓ ఆత్మా! వినుము.
13. సమస్త శరీరములలో జీవునితోపాటు ఉంటూ ఆ శరీరమునకు శక్తినిచ్చు ఓ ఆత్మా! వినుము.
14. ముగ్గురు పురుషులలో అక్షర పురుషుడై శరీరములోనున్న ఓ ఆత్మా! వినుము.
15. ప్రతి శరీరములో జీవాత్మలకు సాక్షిగాయున్న ఓ ఆత్మా! వినుము.
16. ఇంద్రియములకు శక్తి నొసగు ఓ ఆత్మా! వినుము.
17. కొలిమిమంటకు గాలితిత్తి, తిత్తికి కదలించు కట్టె, కట్టెకు చివర కూర్చొని కదలించుచున్న వ్యక్తి ఎలాగ అనుసంధానమై ఉన్నారో అలాగే శరీరములో ముక్కులోని శ్వాసకు ఊపిరితిత్తులు, తిత్తులకు బ్రహ్మనాడి, నాడికి చివరలో వుండి అన్నిటినీ కదలించు ఓ ఆత్మా! వినుము.
18. శరీరములో శ్వాసను నడిపించు ఓ ఆత్మా! వినుము.
19. సమస్త జీవులందు ఒకే పని చేయుచున్న ఆత్మా, జీవుడైన నేను చెప్పు మాట వినుము.
20. రెండవ ఆత్మవై శరీరములో అన్ని పనులు చేయుచున్న ఓ ఆత్మా! వినుము.
21. శరీరములో నివాసముంటున్న మూడు ఆత్మలలో అహర్నిశలూ జీవున్ని కాచుకొని యుండు ఓ రెండవ ఆత్మా! వినుము.
22. ముగ్గురు పురుషులలో మధ్యవాడవై పూజ్యుడవైవున్న ఓ ఆత్మా! వినుము.
23. సమస్త సజీవ శరీరములందు నఖ శిఖ పర్యంతమూ వ్యాపించి శరీరములోని అన్నీ అవయములచేత పనులు చేయించుచున్న ఓ ఆత్మా! వినుము.

24. శరీరములోని జీవునికి సాక్షిగా నున్న ఓ ఆత్మా! వినుము.

25. పూలహారములో ఆధారమై దాగియున్న దారమువలె శరీరములో కనిపించక శరీరమునకంతటికీ ఆధారమైయున్న ఓ ఆత్మా! వినుము.

26. శరీరాంతర్గతములలో ఉండి జ్ఞానము చేత పొగడబడు ఓ ఆత్మా! వినుము.

27. సమస్త జీవ శరీరములలో మూడు గుణముల మధ్య సాక్షిగాయున్న ఓ ఆత్మా! వినుము.

28. అఖిల జీవులతో కూడియున్న ఓ ఆత్మా! వినుము.

29. సమస్త జీవరాసుల యందుగల మూడు ఆత్మలలో మధ్యనున్న ఓ ఆత్మా! వినుము.

30. చిన్న చీమలోను పెద్ద ఏనుగులోను, ఒకే విధానము కల్గి కర్మను పాలించు ఓ ఆత్మా! వినుము.

31 శరీరములోని అన్ని భాగములకు శక్తి నిచ్చుచూ ఎవరికీ తెలియకుండా వున్న ఓ ఆత్మా! వినుము.

32. నా శరీరములో నాకు తెలియకుండా నిదురలోను, మెలుకువలోను నాయందు పనిచేయుచున్న ఓ ఆత్మా! వినుము.

33. అద్వైతాది మహామునులు శరీరములో ఉన్నది నేను ఒక్కడినేనని చెప్పుకొనుచుండినప్పటికీ, నీవు మాత్రము వేరుగయుండి జీవుని కర్మననుసరించి శరీరమును కదలించుచూ, జరిగెడి ఏ కర్మకూ బాధ్యుడు కాని ఓ ఆత్మా! వినుము.

34. శరీరములో అణువణువునా వ్యాపించి విధిని అనుసరించి శక్తినిచ్చు ఓ ఆత్మా! వినుము.

35. శరీరములో బాహ్య ప్రపంచముతో సంబంధము పెట్టుకొని ఎల్లవేళలా పనిచేయుచున్న ఓ ఆత్మా! వినుము.

36. శరీరములో ఏమాత్రము నిద్రలేకుండా ఎల్లపుడూ మేల్కొని పని చేయు ఓ ఆత్మా! వినుము.

37. ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క ఆత్మగా జీవాత్మకు తోడున్న ఓ ఆత్మా! వినుము.

38. శరీరాంతర్గతమై బాహ్య దృష్టికి కనిపించక, జీవాత్మలైన స్వాములు మునులు కూడా నేనే ఆత్మనని తలపోయినట్లు చేసి, నీవు మాత్రము వేరుగనున్న ఓ ఆత్మా! వినుము.

39. జీవాత్మకు పరమాత్మకు మధ్యన గల ఓ ఆత్మా! వినుము.

40. చెట్టులో తేమ వ్యాపించినట్లు శరీరములో శక్తిగా వ్యాపించియున్న ఓ ఆత్మా! వినుము.

41. ఇనుముతో కలసిన అగ్నికి కూడా కొలిమి దగ్గర సమ్మెట దెబ్బలు తప్పవన్నట్లు జీవునితో చేరి శరీరమంతా వ్యాపించి అప్పుడప్పుడూ ఆకలికి శక్తి హీనత చెందుచున్న ఓ ఆత్మా! వినుము.

42. శరీరములో బ్రహ్మనాడిని కేంద్రముగా చేసుకొని శరీరమంతా వ్యాపించియున్న ఓ ఆత్మా! వినుము.

43. జీవాత్మకు పెద్దవాడు పరమాత్మకు చిన్నవాడయిన ఓ ఆత్మా! వినుము.

44. సమస్త శరీరములలో నాశనమగు జీవాత్మతో కలసి నివాసము చేయుచున్న, నాశనము కాని ఓ ఆత్మా! వినుము.

45. శరీరమందు మాత్రము శక్తిగా యున్న ఓ రెండవ ఆత్మా! వినుము

46. శరీరములో కర్మానుసారము కదలికలిచ్చుచూ, కర్మానుసారము రోగములు కలుగజేయుచు వాటిని అనుభవింపజేయు ఓ ఆత్మా! వినుము.

47. శరీరములోని మూడు ఆత్మలలో మధ్య ఆత్మయై శరీరమును నడిపించు శక్తియున్న ఓ ఆత్మా! వినుము.

48. శరీరములో ఎవరూ గుర్తించలేని విధముగా శరీర ఆకృతిని పోలియుండు ఓ ఆత్మా! వినుము.

49. శరీరములోని బ్రహ్మనాడిని స్థావరముగా ఏర్పరుచుకొని శరీరమంతటా నఖ శిఖ పర్యంతమూ వ్యాపించి శరీరాకృతిని పోలియున్న ఓ ఆత్మా! వినుము.

50. శరీరములోపల జరుగు సమస్త కార్యములకు సాక్షియైయున్న ఓ ఆత్మా! వినుము.

51. అకాల మరణము పొందినవానికి శరీరము పోయినప్పటికీ అదే శరీరాకృతి కల్గి సూక్ష్మముగా కనిపించక వాని కర్మానుసారము ఆడించు ఓ ఆత్మా! వినుము.

52. మరణముండి నాశనము లేని ఓ ఆత్మా! వినుము.

53. ఆకాశముననున్న సూర్యుడొక్కడే ప్రపంచమంతటినీ తన వెలుగుచే ప్రకాశింపజేసినట్లు బ్రహ్మనాడియందుండి శరీరమంతటా చైతన్యముగా వ్యాపించియున్న ఓ ఆత్మా! వినుము.

54. శరీరగృహములో యజమానియైన ఓ ఆత్మా! వినుము.

55. హృది మధ్యలో నివాసముజేయుచూ సూత్రధారివై యుండి జీవునిపాత్రధారునిగా ఆడించు ఓ ఆత్మా! వినుము.

56. సమస్త జీవులందు ఏక కార్య స్వరూపుడయిన ఓ ఆత్మా! వినుము.

57. పురుషులందు రెండవవాడయిన ఓ అక్షర పురుషుడా! వినుము.

58. సమస్త జీవులందు కదలిక శక్తినిచ్చు ఓ ఆత్మా! వినుము.

59. ముందు నీవుండి, నీవెనక జీవున్ని పెట్టుకొనిన ఓ ఆత్మా! వినుము.

60. పరమాత్మ ప్రక్కనుంచుకొని జీవునితో కలసియుండి శరీరముతో పనులు చేయు ఓ ఆత్మా! వినుము.

61. అన్ని జీవులందు వేరు వేరుగా కలిసియున్న ఓ ఆత్మా! వినుము.

62 శరీరము వెలుపల ఏమాత్రమూ లేక లోపల మాత్రము చైతన్యముగానున్న ఓ ఆత్మా! వినుము.

63. అఖిల జీవులందు కలిసియున్న ఓ ఆత్మా! వినుము.

64. మూడు గుణములకు వేరుగావున్న ఓ ఆత్మా! వినుము.

65. జీవుల ప్రక్కనేనున్న ఓ ఆత్మా! వినుము.

66. కాగిన ఇనుములో అగ్నియున్నట్లు సమస్త జీవుల శరీరములందు ఇమిడియున్న ఓ ఆత్మా! వినుము.

67. సూర్యుడొక్కడు ఈ లోకమును ప్రకాశింపజేయునట్లు శరీరమంతటినీ నీ ఒక్కనివే ప్రకాశింపజేయు ఓ ఆత్మా! వినుము.

68. నాశరహితునివై నాశనముకాగల జీవాత్మతో కూడివున్న ఓ ఆత్మా! వినుము.

69. పూసల మధ్యలో దారమున్నట్లు జీవుల శరీర మధ్యలో శరీరమంతటికీ ఆధారమైయున్న ఓ ఆత్మా! వినుము.

70. ఎడతెరిపి లేకుండా ఎల్లకాలములందు జీవునితో కలిసియున్న ఓ ఆత్మా! వినుము.

71. చర ప్రకృతియైన శరీరమంతటా వ్యాపించివున్న ఓ ఆత్మా! వినుము.

72. పంచభూత నిర్మాణమైన శరీరమునకు ఆధారముగానున్న ఓ ఆత్మా! వినుము.

73. పరమాత్మ కాక, జీవాత్మవూ కాక కేవలము ఆత్మవై జీవాత్మతో పాటు శరీరములోనున్న ఓ ఆత్మా! వినుము.

74. మొదటిదయిన జీవాత్మకు, మూడవదయిన పరమాత్మకు మధ్య సంధానమైయున్న ఓ రెండవ ఆత్మా! వినుము.

75. కాగిన ఇనుములో ఇనుమంతయూ అగ్ని వ్యాపించినట్లు శరీరమంతా వ్యాపించియున్న ఓ ఆత్మా! వినుము.

76. పరమాత్మ పాలించు విశ్వమను సామ్రాజ్యములో, శరీరమను సామంత రాజ్యమునకు రాజయిన ఓ ఆత్మా! వినుము.

77. ప్రపంచమంతటికీ గల ముగ్గురు పురుషులలోనూ మధ్య పురుషుడవై అక్షర పురుషుడని పేరుగాంచి క్షరపురుషుని వద్ద నిలచిన ఓ ఆత్మా! వినుము.

78. శరీరములో సకలేంద్రియములకు శక్తినిచ్చు ఓ ఆత్మా! వినుము.

79. బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములకు ఇరుసుగానున్న ఓ ఆత్మా! వినుము.

80. జ్ఞానులయందును, అజ్ఞానులయందును, మూర్ఖులయందును, తెలివైనవారియందును, మంచివారియందును, చెడువారి యందును, అన్ని మతములవారియందును ఒకే పద్ధతికల్గి, ఒకే విధముగా రాగము (ప్రేమ) గానీ, ద్వేషముగానీ లేకుండా వర్తించు ఓ ఆత్మా! వినుము.

81. పురుషాకృతియైన ఈశ్వర లింగము మీద ముగ్గురు పురుషుల గుర్తుగా యున్న మూడు విభూతి రేఖలలో మధ్యరేఖగా గుర్తింపబడి యున్న ఓ ఆత్మా! వినుము.

82. శరీరములోనే దృష్ఠి నిల్పి నిన్ను తెలియవలెనని ప్రయత్నించు యోగులకు తెలియబడు ఓ రెండవ ఆత్మా! వినుము.

83. పూలమాలకు ఆధారమైన దారమువలె శరీరమునకు ఆధారమైయున్న ఓ ఆత్మా! వినుము.

84. సకల శరీరములందు మూడవస్థలలో చైతన్యమునిచ్చు ఓ ఆత్మా! వినుము.

85. పాపము చేయునపుడు పుణ్యము చేయునపుడు, ఒకే విధముగా శరీరమునకు శక్తినిచ్చి ఏ కర్మ అంటకుండా ఉండు ఓ ఆత్మా! వినుము.

86. భువిలో ఎన్ని జీవరాసులున్నాయో అన్నిటిలోను అన్ని ఆత్మలుగా విభజింపబడి, పరమాత్మ ప్రతినిధిగా ప్రకృతిలో కలసి శరీరములో పనిచేయుచున్న ఓ ఆత్మా! వినుము.

87. ఏ విషయముతో సంబంధము లేకుండా శరీరములోని కర్మ ప్రకారము శరీరమును నడిపించు ఓ ఆత్మా! వినుము.

88. శరీరములోని బ్రహ్మనాడి యొక్క ఏడు ద్వారముల ద్వారా మరియు గ్రంథుల యొక్క ఏడు ద్వారముల ద్వారా శరీరమును పాలించు ఓ ఆత్మా! వినుము.

89. సమస్త జీవరాసుల బుద్ధికి సమానముగా అర్థమగు ఓ ఆత్మా! వినుము.

90. అయమాత్మ బ్రహ్మమని సమస్త యోగుల చేత ఉచ్ఛరించబడు ఓ ఆత్మా! వినుము.

91. జాగ్రత్త, స్వప్న, నిద్రయనబడు మూడవస్థలకు సాక్షిగానున్న ఓ ఆత్మా! వినుము.

92. మూడు ఆత్మలందు మధ్య ఆత్మవై సమస్త యోగులచే ఆరాధింపబడు ఓ ఆత్మా! వినుము.

93. శరీరములోని 25 భాగములకు అతీతముగాయుండి శరీరమంతటికీ శక్తినొసగు ఓ ఆత్మా! వినుము.

94. పరమాత్మకంటే తక్కువవాడై, జీవాత్మకంటే ఎక్కువవాడైయున్న ఓ ఆత్మా! వినుము.

95. ఇంటిలో విద్యుశ్చక్తిలాగా శరీరములో చైతన్య శక్తియైయున్న ఓ ఆత్మా! వినుము.

96. యోగులందును, భోగులందును సమాన వృత్తి కల్గియున్న ఓ ఆత్మా! వినుము.

97. శరీరములో అణువణువునా వ్యాపించి శరీరాంతర్గత పనులకు కారణశక్తియై యున్న ఓ ఆత్మా! వినుము.

98. అండజ, పిండజ, ఉద్భిజములైన మూడు రకముల జీవరాసులలో ఏ జీవరాసియందైనాగానీ ఒకే సిద్ధాంతము, ఒకే నిర్ణయముగా, ఒకే పద్ధతిగా పనిచేయు ఓ ఆత్మా! వినుము.

99. జీవాత్మ ఏ శరీరములో ప్రవేశించినా దాని వెంట ఆ శరీరములో ప్రవేశించి అక్కడ కర్మరీత్యా ఏమి జరుగవలెనో, ఆ పనులను శరీరము ద్వారా చేయించు ఓ ఆత్మా! వినుము.

100 శరీరములో పని నీవు చేసి ఫలితమును జీవాత్మకు అందించే ఓ ఆత్మా! వినుము.

101 శరీరములోని ప్రాణమునకు ఆధారమై ఆడించుచున్న ఓ ఆత్మా! వినుము.

102. నేను పుట్టినప్పటి నుండి నాలో అన్ని పనులకు సాక్షిగాయుంటూ ప్రారబ్దమును నాచేత అనుభవింపజేయు ఓ ఆత్మా! వినుము.

103. శరీరమనెడి రథమునకు సారధిగా యుండి ఇంద్రియములనెడి గుఱ్ఱములను త్రోలు సారథియై శరీర రథమును అధిష్ఠించి యున్న జీవునికి సుఖదుఃఖములనెడి అనేక ప్రదేశములను చూపుచున్న ఓ ఆత్మా! వినుము.

104. చెట్టుకు తాట అనుబంధమై ఉన్నట్లు శరీరములోని జీవాత్మకు శక్తి రూపములో అనుబంధమైయున్న ఓ ఆత్మా! వినుము.

105. సంసారమను నాటకమునకు పరమాత్మ సూత్రధారి కాగా, నాటకమును వీక్షించుచు నాటకములోని భావములను అనుభవించు ప్రేక్షకుడు జీవుడుకాగా నాటకమును ఆడు ఓ ఆత్మా! వినుము.

106. శరీరములో నీవు చేస్తున్నప్పటికీ జీవాత్మ తాను చేసినట్లు తలచితే ఆ పనిలోని కర్మను జీవునికి అంటకట్టు ఓ ఆత్మా! వినుము.

107. శరీరములో ప్రారబ్ధకర్మ ప్రకారము సుఖదుఃఖములను అందించుచూ అహము పొందిన జీవాత్మ పాలిట చిత్రగుప్తుడవై ఆగామికర్మను అంటగట్టు ఓ ఆత్మా! వినుము.

108. మంచి చెడు కర్మలను తారతమ్యము లేకుండా ఆచరించుచూ పాప పుణ్యములకు సంబంధము లేని ఓ ఆత్మా! వినుము.

109. అజ్ఞానులలో ప్రారబ్ధమును అనుభవింపజేయుచు ఆగామికర్మను అంటగట్టుచూ, జ్ఞానము తెలిసిన యోగులలో ప్రారబ్ధమును అనుభ వింపజేయుచూ ఆగామికర్మను అంతము చేయుచున్న ఓ ఆత్మా! వినుము.

110. శరీర యంత్రాంగములో 24 భాగములను ఒక్క జీవుని కొరకు నడిపిస్తూ పరమాత్మకు బంటుగా నిలిచిన ఓ ఆత్మా! వినుము.

111. శరీరములో నీవు ఏమి చేయుచున్నది ఎవరికి తెలియనీయకుండా నిద్రించు సమయములో కూడా శ్వాసను నడుపుచున్నావు. అటువంటి నీ ఉనికిని తెలియక అన్నీ నేనే చేయుచున్నానని జీవుడు భ్రమిస్తున్నప్పటికీ, ఏ పనినీ జీవునికి వదలక, అన్ని పనులను ఎంతో ఓర్పుగా చేయుచున్న ఓ ఆత్మా! వినుము.

112. శరీరములో తప్ప బయట ఎక్కడా ఏ వస్తువందు లేని ఓ ఆత్మా! వినుము.

113. శరీరములో బుద్ధికి తెలియని విద్యలయిన జంతువు చిన్నతనము లోనే నీటిలో ఈదడమును, దూడ పాల పొదుగును గుర్తించడమును, ఐదు సంవత్సరముల చిన్నవయసు మనిషికి పాండిత్యము కలుగడము మొదలగు వాటిని తెలియజేయుచూ ఏమీ తెలియని దానివలెనున్న ఓ ఆత్మా! వినుము.

114. జీవుడు ధరించిన శరీరము ఎంత పరిమాణముండునో అంతే లావు అంతే ఎత్తు కల్గి ఆ శరీర ఆకృతిని కల్గియున్న ఓ ఆత్మా! వినుము.

115. శరీరములో అంతటా వ్యాపించియుండి కర్మవుంటే చేతిలోనో, కాలిలోనో శక్తి లేకుండా చేసి అవిటివానిగా కనిపింపజేయుచూ జీవునికి కర్మను అనుభవింపజేయు ఓ ఆత్మా! వినుము.

116. శరీరములో ప్రారబ్ధకర్మను జీవుని చేత అనుభవింపజేయు యమ ధర్మరాజువై, అహముగలవానికి అగామి కర్మను తలకు ఎక్కించడములో చిత్రగుప్తుడవై చలామణి అగు ఓ ఆత్మా! వినుము.

117. మరణములోనూ, పుట్టుకలోనూ జీవుని వెంటవుండి మరణము నుండి పుట్టుక వరకు గుణములను, జీవున్ని కర్మసముదాయమును తీసుకు వస్తున్న ఓ ఆత్మా! వినుము.

118. శరీరములో అన్ని పనులు చేయుచూ ఏ ఒక్క పనిని కూడా నేను చేశానని బయటికి తెలుపక ఎన్నో విజ్ఞాన పరికరములను కనిపెట్టించు యోచనను ఇచ్చినప్పటికీ ఏమీ తెలియని జీవుడు నేను కనిపెట్టానని చెప్పుకొనుచున్నప్పటికీ ఊరక చూస్తుండిన ఓ ఆత్మా! వినుము.

119. చావులోనూ, పుట్టుకలోనూ సాక్షిభూతుడవై ఆ సమయములో ఏమి జరుగుచున్నదో ఎవరికీ తెలియని రహస్యమును తెలిసిన ఓ ఆత్మా! వినుము.

120. చెట్టులో చెట్టు ఆకృతిని పోలియుండి, జంతువులో జంతువు ఆకృతిని పోలియుండి, మనిషిలో మనిషి ఆకృతిని పోలియుండి అనేక శరీరములలో ఆ శరీరములవలె అనేక ఆకారములు కల్గియున్న ఓ ఆత్మా! వినుము.

ఈ గ్రంథమునందు ప్రతి పద్యము చివరిలో **"అఖిల జీవసంగ ఆత్మలింగ"** అని చెప్పబడినది దీని అర్థమేమనగా అన్ని జీవరాసులందు కలసి ఉన్న ఓ ఆత్మా అనుటయే. **"ద్వా విమౌ పురుషౌ లోకే"** అను గీతా వాక్యము ప్రకారము మన శరీరములో రెండు ఆత్మలున్నవి. ఒకటి జీవాత్మ, రెండవది ఆత్మ. జీవాత్మ ఒక్క శరీరమునందు మాత్రము వ్యాపించి ఉన్నది. ఆత్మ అన్ని దేహములందు వ్యాపించి ఉన్నది. ఈ గ్రంథమందు పద్యములు చెప్పినవాడు కూడా మనిషియే, ఆయన శరీరమందు కూడా ఆత్మ ఉన్నది. తాను చెప్పు విషయములు ఇతరులకు చెప్పనట్లు తనలో ఉన్న ఆత్మకే చెప్పుకున్నట్లు పద్యాల చివర **"అఖిల జీవసంగ ఆత్మలింగ"** అన్నారు. ఇట్లు చెప్పుటవలన ఇతరులకు ఇష్టమైతే ఈ మార్గమును అనుసరింతురు, కష్టమైతే వదలి పెట్టుదురు, కానీ సరిపడనివారు దూషించరు. ఈ గ్రంథములో అజ్ఞానులలోని అంధకారమును చూపెట్టుచూ జ్ఞాన మార్గములను చెప్పడమైనది. అటువంటపుడు ప్రజలను ఉద్దేశించి చెప్పినట్లు కనిపించినా, కొంతమందికి వ్యతిరిక్తముగా ఉండును. కావున చెప్పు విషయము ప్రజలకేనయినా చివరి వాక్యము తనలోని ఆత్మకే చెప్పుకొన్నట్లు వ్రాయ బడినది.

**ఆ ॥ శ్రీ పరశివ నీదు శృంగార తత్వంబు**
**నీ మహీతలమున నెచ్చుగాను**
**నేను చెప్పబూన నేర్చితి నీకృప**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 1**

**భావము :** సమస్త జీవరాసులందు కలసియున్న ఓ ఆత్మా! వినుము, మాకంటే పరముగా ఉన్నవాడా! ఆత్మకంటే వేరుగా ఉన్న ఓ పరమాత్మ! నీ యొక్క మహిమా విశేషమును, అందమైన విధానమును నీ కృపాకటాక్షము వలన నేచెప్పబూనినాను.

**ఆ ॥ నీతి భక్తియోగ నిజమెల్ల గురుమూర్తి**
**చెప్పి శతకమిట్లు చేసినాడు**
**రండు దీని జూడ రక్తిగా మీరెల్ల**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 2**

**భావము :** అఖిల జీవులందు ఒకే చైతన్యముగనున్న ఆత్మా! నాలో ఉన్న శ్రీగురుదేవుడే నా చేత నీతి భక్తి యోగములను వ్రాయించి శతకముగా జేయించినాడు. మీరందరూ సంతోషముతో దీనిని తెలుసుకొనుడు.

*ఆ ॥ శంక పట్టకండి శాస్త్రజ్ఞుడను గాను*
*వంక లెంచకండి వైరమునను*
*మనస్సు నిల్పి దీని మర్మంబు దెలియండి*
*అఖిల జీవసంగ ఆత్మలింగ. 3*

**భావము :** గాలిలో గంధము కలసి కనిపించనట్లు, శరీరములో కంటికి కనిపించక ఉన్న ఓ ఆత్మా! వినుము. తప్పు పట్టకండి శాస్త్రముల తెలిసిన వాడనుగాను. నాపైన సరిపోని భావముతో ఇది పనికిరాని విషయమనకండి. మనస్సును ఈ విషయము మీద లగ్నము చేసి నేను జెప్పు మర్మములను తెలుసుకొనుము.

**ఆ ॥ తప్పు లెంతురయ్య తపసులకైనను**
**ధరణి జనులకున్న ధర్మమదియ**
**అందుకొరకు నే నాదినే జెప్పితి**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 4**

**భావము :** సాక్షివై అన్ని జీవులందున్న నా లోని ఆత్మా! వినుము. పెద్ద తపస్వికులనైననూ, యోగులనైననూ, ప్రజలు తప్పుల నెదుకుచుందురు.

ఏ విషయము వారికి తెలియకుండినా ఇతరులను గూర్చి విమర్శించి తప్పుగా మాట్లాడడము భూమి మీద ప్రజలకు పెద్ద అలవాటై, అదియే వారికి ముఖ్య ధర్మముగా ఉన్నది. అందువలన నన్ను తప్పు పట్టకండి, మంచి మనస్సుతో నాబోధను వినుమని ముందుగానే చెప్పుకొనుచున్నాను.

**ఆ ॥ నాకు భయము లేదు నన్ను మీరేమన్న**
**నన్నన్న వారు నాకు నాత్మప్రియులు**
**ఉన్నదున్న యట్లు ఊహించి చెప్పెద**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 5**

**భావము :** శక్తి రూపములో శరీరమంతయూ వ్యాపించినయున్న ఓ ఆత్మా! వినుము. నేను చెప్పిన విషయములు మీకు సరిపోక నన్ను మీరేమన్నను నాకు భయము లేదు. నన్ను ఎవరు ఏమనినా నాకు వారు ఆత్మప్రియులే. ప్రపంచములోని వారికి భయపడక ఉన్న సత్యమును ఉన్నట్లు చెప్పుట నా కర్తవ్యము.

**ఆ ॥ వరుసపెట్టి నేను వర్ణింతు పద్యాలు**
**సరసులైతే దీని జక్కగాను**
**గన్నవారికెల్ల గల్గును సౌఖ్యంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ 6**

**భావము :** సమస్త జీవులందు చైతన్యమై ఉన్న ఆత్మా! నా మాట వినుము. ఆత్మ విషయములను ఉన్నదున్నట్లు క్రమముగా, పద్య రూపముగా చెప్పుచున్నాను. దీని మీద అభిలాష కల్గినవారు నేను చెప్పిన విషయములను తెలుసుకొంటే ప్రకృతికంటే మించిన ఆత్మ సుఖము కల్గును.

**ఆ ॥ మొదట జగము లేక మూడు రేకుల చెట్టు**
**తుదను కొమ్మలైదు తూగులాడి**
**కొమ్మ కొమ్మలందు కోటి కాయలు కాచె**
**అఖిల జీవసంగ ఆత్మలింగ 7**

**భావము :-** సమస్త జీవులందు చైతన్యముగానున్న ఓ ఆత్మా! వినుము. ప్రపంచము లేని సమయములో మనకు కనిపించునది ఏమియులేదు. చివరకు శూణ్యమైన ఆకాశము కూడా లేదు. అది అవ్యక్తమైన పరిశుద్ధ పరమాత్మ మాత్రముండు స్థితి. ఆ స్థితి ఎటువంటిదో ఎవరూ ఊహించను గానీ, అంచనా వేయడముగానీ, యోచించడమునకుగానీ సాధ్యము కాదు. అట్టి అగమ్యముయైన, అగోచరమైన, అవ్యక్తమైన స్థితినుండి మూడు ఆత్మలు విభజించబడినవి. అవియే పరమాత్మ, ఆత్మ, జీవాత్మ తర్వాత పుట్టినది ప్రకృతి. ప్రకృతిని విభజించి చూచిన ఐదు భాగములుగా ఉన్నది. దైవము నుండి పుట్టిన పంచభూతములు ఒక్కొక్కటి ఐదు భాగములుగా విభజింపబడి మొత్తము ఇరువదైదు భాగములైనవి. ఆ ఇరువదైదు భాగములకు శరీరములు తయారై జీవుల నివాసయోగ్యముగా మారినవి. ఎన్నో కోట్ల కొలది గల జీవరాసులకు ప్రకృతి యొక్క శరీరములే నివాసములైనవి.

ఏమీ కాని అవ్యక్తము నుండి మూడు భాగముల ఆత్మలు పుట్టినవి. కావున పై పద్యములో "మొదట జగములేక మూడు రేకుల చెట్టు" అన్నారు. పరమాత్మ నుండి పంచభూతములు పుట్టినవి కావున "తుదను కొమ్మలైదు తూగులాడి" అన్నారు. అసంఖ్యాకములైన సమస్త జీవరాసులు ప్రకృతిచే స్థూలముగా పుట్టుచున్నవి కావున ఈ పద్యములో "కొమ్మ కొమ్మలందు కోటి కాయలు కాచె" అని అతి పెద్ద సంఖ్యను చెప్పారు. ఈ పద్య సారాంశమంతయు మూడు ఆత్మల యొక్క పుట్టుదలను మరియు జగతిని గూర్చి చెప్పబడి ఉన్నదని తెలియవలెను.

**ఆ ॥ ఏమి చిత్రమదియ నెట్లు సృజించెనో**
**పత్రమొకటి లేదు ఫలము లేదు**
**వేరు లేదు చూడ వేత్తల కీజాడ**
**అఖిల జీవసంగ ఆత్మలింగ 8**

**భావము :** మూడు ఆత్మలలో రెండవదైన ఓ ఆత్మా! వినుము. పరమాత్మ ఎంతో విచిత్రముగా విశ్వమును తయారు చేసి ప్రపంచములో జగతియైన శరీరములను సృష్టించాడు. పంచభూతములైన ప్రపంచమును, జీవ చైతన్యము కల్గిన శరీరములయిన జగతిని కల్పి విశ్వము అంటాము. విశ్వము మార్పుచెందని, మరణము పొందని పంచభూతములతోనూ మరియు మార్పు చెందుచున్న మరణము పొందుచున్న శరీరములతోనూ నిండిఉన్నది. విశ్వము ఎలా పుట్టిందని చూచితే ఏమాత్రము దాని జాడగానీ ఆధారము గానీ దొరకదు. విశ్వము పుట్టుటకు కారణమైన కర్మలేదు, కర్మకు కారణమైన కార్యము లేదు. ఎంతో పెద్దగా ఉన్న భూమి, ఆకాశము వాటి మధ్యలోగల భయంకరమైన గాలి, అగ్ని, నీరు ఏమీలేని, ఏమీకానీ స్థితినుండి పుట్టడము చాలా విచిత్రము. స్థూలమై కంటికి కనిపించు ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి ఎలా పుట్టాయో యోచించిన వారికి ఇసుమంతయు అర్థము కాదు. అన్నిటికీ మూలపురుషుడైన దైవము నుండి పుట్టిన విశ్వము యొక్క పుట్టుకను గురించి ఎవరూ తెలుసుకోలేరు. విశ్వము పుట్టుకను తెలియుటకు ఏ ఆధారము లేదు కనుక **"పత్రమొకటి లేదు ఫలము లేదు, వేరు లేదు చూడ వేత్తల కీజాడ"** అని తన పద్యమందు అన్నారు. ఎంతో బలమైన గాలిని, అన్నిటినీ కాల్చివేయు అగ్నిని, ఎంతో శక్తిగల నీటిని, చిన్న రేణువు నుండి భూమండలము నక్షత్రమండలము వరకు ఏ సైన్సుకూ అందని ఆధారముతో పరమాత్మ పుట్టించడము ఆలోచించినా అర్థముగానీ గొప్ప విచిత్ర విషయముగానున్నది.

**ఆ ॥ ప్రణవ మందు నైదు ప్రాణాక్షరాల్పుట్టి**
**జగము లాయెనయ్య జతన మగుచు**
**అదియు జీవమాయె ఆ పైది శివమాయె**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 9**

**భావము :** అఖిల జీవరాసులందు అన్ని పనులు చేయిస్తున్న ఓ ఆత్మా! వినుము. ఏమీ లేని, ఏమీ కానీ స్థితి నుండి మొదట ప్రకృతి పుట్టినదని తెలుసుకొన్నాము. ప్రకృతి నుండి ఐదు భాగములు చీలిపోయినవి. అవియే ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అనునవి. ప్రకృతి విభజింపబడి ప,ర,క,రు,తి అను బీజాక్షరములుగా తయారై ఆ బీజములకు మరణించని, మార్పు చెందని ఐదు వస్తువులు అచర ప్రకృతి అను పేరుతో ప్రపంచముగా తయారైనవి. ప్రపంచరూపముగనున్న ఆకాశము **"ప"** నుండి, గాలి **"ర"** నుండి, అగ్ని **"క"** నుండి, నీరు **"రు"** నుండి, భూమి **"తి"** నుండి పుట్టినవి. దీనినే మార్పు చెందని అచర ప్రకృతి అంటున్నాము. మార్పు చెందుచూ మరణము పొందు ప్రకృతి మరియొకటి కలదు. దానినే చర ప్రకృతి అంటున్నాము. అచర ప్రకృతిని ప్రపంచము అను పేరుతో పిలువగా **'చర'** ప్రకృతిని **'జగతి'** అని పిలుచుచున్నాము. జగతి జీవరూపమైన శరీరములుగా ఉన్నది.

జీవరూపమైన జగతి ప్రకృతి నుండి పుట్టినదే. అదెట్లనిన ప్రకృతి ఐదు బీజాక్షరములుగా విడిపోయి వాటికి పంచభూతములనబడు ప్రపంచము తయారయినదని తెలుసుకొన్నాము. ప్రకృతి విడిపోయిన ఐదు బీజాక్షరముల నుండి కొంత మార్పు చెందిన మరియొక ఐదు బీజాక్షరములు పుట్టినవి అవియే న, మః, శి, వా, య. మొదట పుట్టిన ఐదు బీజాక్షరములయిన "ప" నుండి "న", "ర" నుండి "మః", "క" నుండి "శి", "రు" నుండి "వా", "తి" నుండి "య" అనునవి తయారైనవి.

**ప ర క రు తి - అచర ప్రకృతి (ప్రపంచము)**

**న మః శి వా య - చర ప్రకృతి (జగతి)**

అచర ప్రకృతియైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అనునవి వేరు వేరు భాగములుగా ఉన్నవి. చర ప్రకృతియైన జగతి పంచభూతములు కలసి ఏర్పడినది. పంచభూతములయిన ప్రకృతికి పరమాత్మ కలియుట చేత అచర, చరయైన రెండు ప్రకృతులకు చైతన్యము కల్గినది. రెండు ప్రకృతులలో విడిగా ఉన్న ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమికి చైతన్యము ఏర్పడగా, అలాగే ఇరువదైదు భాగములుగా విడిపోయి ఒకదానితో ఒకటి కలసియున్న చర ప్రకృతికి చైతన్యముతో పాటు జీవమేర్పడినది. చర ప్రకృతి శరీరరూపమై అసంఖ్యాకముగా ఉంటూ అనేక జీవరాసులు నివశించుటకు ఆధారముగ ఉన్నది. పరమాత్మ అంశ ఆత్మగా మరియు జీవాత్మగా విభజింపబడి ప్రకృతి శరీరములలో ఉంటూ ప్రపంచమంతటా జగతిగా వ్యాపించి ఉన్నది. పరమాత్మ జీవరూపమైన శరీరములలోనేకాక మరణము లేని ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమియందు కూడ వ్యాపించి ఉన్నది. కాని ఇందులో ఒక ప్రత్యేకత కలదు. అది ఏమనగా! శరీరములు కల్గి ఉన్న ప్రకృతిలో జీవమేకాక ఆత్మ కూడ కలదు. పంచ భూతములయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు భూమిలో ఆత్మ యున్నది కాని ప్రత్యేకించి మనవలె కర్మగల జీవాత్మ లేదు. అవసరమొచ్చినపుడు వాటిలో కర్మలేని జీవాత్మ తన పాత్ర పోషించగలడు. జీవరాసుల శరీరములలో అలా కాకుండా ఒక్కొక్క శరీరమునకు ఒక్కొక్క కర్మగల జీవాత్మ కేటాయించబడి ఉన్నవి.

శరీరమున్న జీవరాసులకు కర్మ గుణములుండి మరణము కూడా కలదు. మరణములో ఆత్మ కర్మ గుణములను జీవున్ని మరియొక శరీరమునకు తీసుకొని పోవును. అంతేకాక కర్మ ప్రకారము జీవుడు అనుభవించుటకు అన్ని పనులు ఆత్మయే చేయవలసి ఉన్నది. కావున శరీరములలో జీవునితోపాటు ఆత్మ ఉండవలసిన అవసరమున్నది. పంచ భూతములు భూమి మీదగల జీవరాసులు పని చేసినట్లు చేయడము గానీ, కర్మ సంపాదించుకోవడముగానీ ఉండదు. కావున ఐదు భూతము లందు మనవలె కర్మగల జీవాత్మ ఉండవలసిన అవసరము లేదు. కొన్ని అత్యవసర పరిస్థితులలో మాత్రము జీవాత్మ తన పాత్రను పోషించగలదు. అందువలన వాటిని భూతములంటున్నాము. భూతము అనగా ఆధ్యాత్మిక పరిభాషలో జీవుడని అర్థము.

జీవరూపమైన ప్రకృతిలో పరమాత్మ అంశ చేత ఆత్మ శరీరములో ప్రత్యేకముగా ఉంటూ, శరీరములో కదలికకు కారణముగా ఉండగా ప్రకృతి భాగములలోని ఆకాశముతో పరమాత్మ అంశ కలియుట ద్వార జీవాత్మ ఏర్పడినది. ప్రకృతిలోని కొంత అంతర్భాగమైయుండుట వలన జీవాత్మ దైవత్వమును కోల్పోయి ప్రకృతి తత్త్వమును కల్గియున్నది. కొంత దైవత్త్వము, కొంత ప్రకృతి తత్త్వము కల్గియుండుట వలన అటు ఇటుగానీ నపుంస కత్వమును కల్గియున్నది. జీవాత్మకంటే వేరుగనున్న ఆత్మ ప్రకృతి భాగము లతో కలియక వేరుగా ఉండుటవలన అది దైవముగా భావింపబడు చున్నది. అందువలన పద్యమందు **"అదియు జీవమాయె"** అని ప్రకృతితో కలిసియున్న జీవాత్మను ఉద్దేశించి అన్నారు. **"ఆ పైది దైవమాయె"** అని జీవాత్మకంటే భిన్నముగా శరీరమునధిష్టించి శిరోభాగమున నివశిస్తున్న ఆత్మను ఉద్దేశించి అన్నారు. ప్రపంచమును, జగతిని రెండిటినీ ఉద్దేశించి **"ఐదు ప్రాణాక్షరము ల్పుట్టి జగములాయెనయ్య జతనమగుచు"** అన్నారు.

**ఆ ॥ మాయ తెలియరాదు మాయ మూలము లేదు**
**మాయ వాయు రూపమాయె**
**మమత తోడ బుట్టె మహదహంకారంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 10**

**భావము :** సమస్త జీవరాసులందు చైతన్యరూపమై ఖండ ఖండములుగా శరీరములో వ్యాపించి ఉన్న ఓ ఆత్మా! వినుము. సృష్టి అంతయు పరమాత్మ నిండియుండగా, జగతియంతయు మాయ నిండి ఉన్నది. సర్వ విశ్వము నంతయు పరమాత్మ సృష్టించగా అందులో జగతియంత మాయను ప్రకృతి సృష్టించినది. ప్రకృతి నుండి పుట్టిన దానిని **మాయ** అని ఒక మతములో అనగా మరియొక మతములో **సాతాన్** అని, మరియొక మతములో **సైతాన్** అనియు అంటున్నారు. కొందరు మాయను స్త్రీతో సమానముగా పోల్చగా కొందరు పురుషునిగా పోల్చారు. వాస్తవానికి మాయ స్త్రీ సంబంధమైనదే. ప్రకృతి అంశయైన దానివలన మాయను స్త్రీ అనుటయే సమంజసము. మాయకు ఒక ప్రత్యేకమైన రూపము లేదు. మాయ గుణముల రూపములో అందరిలోనున్నది. అది ఎవరికి పైకి కనిపించునదికాదు. ఎంతటివారైన దాని విధానమును పూర్తి గ్రహించలేరు. ఎవరైనా దానిని తెలియాలంటే దుస్సాధ్యము ఎవరికీ అర్థము కాదు. మాయ మనుషుల మీద దాడి చేయుచున్ననూ, పెద్ద జ్ఞానులు సహితము ఇది మాయ పనియని తెలియ లేరు. అందువలననే పై పద్యములో **"మాయ తెలియరాదు మాయ మూలము లేదు"** అన్నారు. మాయ కంటికి కనిపించు రూపము లేనిది కావున ఈ పద్యములో **"మాయ వాయు రూపమాయె"** అన్నారు. మాయ శరీరములో గుణముల విధానముతో ఉన్నది. అందువలన **"మమత తోడ బుట్టె మహదహంకారంబు"** అని చెప్పారు.

**ఆ ॥ ఐదు యైదు ఇరువదైదైన మాయకు**
**దొరతనంబు వచ్చె దురిత మెచ్చె**
**భ్రాంతి యంత మాయ బ్రహ్మాండ మంతాయె**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 11**

**భావము :** సర్వజీవరాసులందు నివశిస్తూ, ఆయా శరీర ఆకారము కల్గియున్న ఓ ఆత్మా! వినుము. ప్రకృతి రెండు భాగములై అందులో ఒకటి ఐదు భాగములుగా చీలిపోయి అచర ప్రకృతికాగా, మరొకటి ఐదు ఐదు భాగములుగ చీలి ఇరువదైదు భాగములై ఒకదానితో ఒకటి కలిసి చర ప్రకృతిగా తయారైనది. చరించు ఈ ప్రకృతిలోనే ఎట్లు పుట్టాయో తెలియకుండా, దాని మూలమేమాత్రము అర్థము కాకుండా గుణములు తయారైనవి. గుణములన్నిటిని కలిపి **మాయ** అని అంటున్నాము. ఏ విధముగా తయారైనదో తెలియని మాయ శరీరములోనే ఉంటూ, దాని ప్రభావమును శరీరము మీద అందులోని జీవుని మీద చూపిస్తున్నది. అందువలన ఈ పద్యములో **"ఐదు ఐదు ఇరువదైదైన మాయకు దొరతనంబు వచ్చె"** అన్నారు.

రేపు అనుమాట నిజమేయైనప్పటికీ అది కనిపించదు. రేపు అను మాట భావముతో తెలుసుకోవలసినదే, కావున రేపు అనునది భావముతో కూడిన భ్రాంతి అనవచ్చును. ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు భావించు కోవడమును భ్రాంతి అంటాము. మాయ ఉండి కంటికి కనిపించకున్నది. కనిపించని మాయను, చూపుకు తెలియని మాయను భావమునకు ఉన్నట్లు తెలుసుకొనుట భ్రాంతి అంటాము. స్థూలము కాని సూక్ష్మమైన మాయను ఈ పద్యములో "భ్రాంతియంత మాయ" అన్నారు. తలలో కొద్దిగ ఉన్న భ్రాంతియంత మాయ అన్ని శరీరములందు ఇమిడి ఉన్నది. అన్ని శరీరములు ప్రపంచమంతా నిండి ఉన్నాయి. ప్రపంచమును బ్రహ్మాండమని కూడ

అనుచుందురు. పరమాత్మ చేత పుట్టబడినది కావున ప్రపంచమును బ్రహ్మ అండము అనెడివారు. బ్రహ్మ అనగ పరమాత్మ (పెద్ద) అనియు అండము అనగ గ్రుడ్డు అని అర్థము. కోడి ఉన్నట్లుండి ఒక్కమారు గ్రుడ్డునుపెట్టినట్లు పరమాత్మ లేకున్న ప్రపంచమును ఒక్కమారు కనిపించునట్లు చేశాడు. గ్రుడ్డు కోడికి పుట్టినది కావున కోడి గ్రుడ్డు అన్నట్లు ప్రపంచము పరమాత్మకు పుట్టినది కావున బ్రహ్మ గుడ్డు లేక బ్రహ్మాండము అంటున్నాము. ప్రపంచ మంతా నిండియున్న జీవరాసులలో మాయ ఉండి కనిపించకున్నది కావున మాయ ప్రపంచమంతట జీవరాసులలో నిండియున్నదని తెలియుచున్నది. ఈ విషయమునే **"భ్రాంతి యంత మాయ బ్రహ్మాండ మంతాయె"** అన్నారు.

**ఆ ॥ వాహ్వా దాని శక్తి వస్తాదుగిరియును**
**విస్తరించి బ్రహ్మ విష్ణు శివుల బట్టి**
**భ్రాంతి బెట్టి బలమెల్ల దిగమ్రింగే**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 12**

**భావము :** శరీరమను గుడిలో దీపమై శరీరమంతటికీ వెలుగునిచ్చుచున్న ఓ ఆత్మా! వినుము. మాయ యొక్క శక్తి ఎంతటిదో ఎవరికి అర్థము కాదు. ప్రపంచములో దాని నాయకత్వమునందు అందరిని ఇముడ్చుకొని పెత్తనము చెలాయిస్తున్నది. మాయ యొక్క శక్తి జగతియంతా వ్యాపించి యోగులలో పెద్ద యోగులయిన విష్ణు, ఈశ్వర, బ్రహ్మలను కూడా తన భ్రమలో ముంచి వారిని కూడా యోగభ్రష్టులను చేయుచున్నది. త్రిమూర్తులను కూడా తన భ్రాంతిలో పడునట్లు చేసి, దేవుని మార్గములో బలహీనులను చేయుచున్నది. ఎంత పెద్దవారినయిన తాను తలచుకొంటే జ్ఞాన బలమును కోల్పోవునట్లు చేసి, అజ్ఞానమార్గములో నడుపగలదు. అందువలన మాయ యొక్క బలమును ఒక విధముగా ప్రశంసింపవలసినదే. ఎంతటివారినయిన మార్గము తప్పించు మాయ గొప్పదే కదా!

ఆ ॥ బలము దప్పినట్టి బ్రహ్మాది మూర్తులు
కలత చెంది లేచి కల్వరించి
సృష్టిరూపు దాల్చె చింతించి చింతించి
అఖిల జీవసంగ ఆత్మలింగ. 13

**భావము :** సమస్త శరీరములలో జీవునితోపాటు ఉంటూ ఆ శరీరమునకు శక్తినిచ్చు ఓ ఆత్మా! వినుము. విష్ణు, ఈశ్వర, బ్రహ్మ అనబడు త్రిమూర్తులు కూడా మాయ ప్రభావమునకు తమ యోగబలమును కోల్పోయి, తిరిగి కొంత కాలమునకు ఎరుక కల్గినవారై, కలనుంచి లేచినవాడు సత్యమును తెలుసుకొన్నట్లు నేను ఇంతవరకు మాయ భ్రమలలో మునిగియుంటినని తెలిసినవారై, ఇక మాయలోపడక పరమాత్మనే చింతించి చింతించి సంపూర్ణ యోగులై విశ్వరూపమైన పరమాత్మయందే కలసిపోయిరి.

ఎంతటి గొప్ప యోగులయిన మాయ ధాటికి తప్పక యోగభ్రష్టులగు దురని ఈ పద్యము తెలియజేయుచున్నది. దైవమార్గము నుండి మాయ ప్రభావమునకు తప్పినవారైనప్పటికీ తమ పట్టువదలక, తిరిగి తెప్పరిల్లుకొని మాయ ప్రభావానికి మోసపోయామని తలచి తప్పిపోయిన మార్గమును తిరిగి ఆశ్రయించి మోక్షము పొందవలెను. మోక్షమును పై పద్యములో **“సృష్టిరూపు”** అన్నారు. సృష్ఠి అనగా విశ్వము సృష్ఠి రూపు అనగా విశ్వ రూపము అని అర్థము. విశ్వమంతా వ్యాపించినది పరమాత్మ. పరమాత్మ యందైక్యమై పోవుటను విశ్వవ్యాప్తి చెందుటయని లేక సృష్టిరూపులో కలిసి పోవడమని అనవచ్చును. మాయనుండి తేరుకోలేనివాడు మోక్షము పొందలేడు.

**ఆ ॥ పంచ వన్నెలైన పంజరంబిది యహ**
**మంచి చిలుక యిందు మటముదీర్చి**
**మాటలాడు నయ్య మాణిక్యముల మాట**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 14**

**భావము :** ముగ్గురు పురుషులలో అక్షర పురుషుడై శరీరములోనున్న ఓ ఆత్మా! అయిదు భాగములైన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి చేత తయారయిన శరీరమిది. దీనియందు పక్షి మాదిరి ఎగిరిపోవు వాయువు (శ్వాస) నివాసముజేయుచున్నది. ఆ గాలి శ్వాసరూపమున ముక్కు రంధ్రముల ద్వారా చలించుచు వింత శబ్దముజేయుచున్నది.

**విశేషార్థము :** మన శరీరము పంచభూత నిర్మితమైనది. కావున శరీరమునే "పంచవన్నెలైన పంజరము"యని చెప్పడమైనది. శరీరమందు గాలి నివాసమై ఉన్నందున శరీరమును పంజరమనుట జరిగినది. ఆకాశముతో (శూన్యముతో) నిండియున్న ముక్కు రంధ్రములందు ఎగురుచున్న శ్వాసను పక్షిగ చెప్పడమైనది. అనేక గ్రంథములందు కూడా శ్వాసను హంసయని చెప్పియున్నారు. శ్వాస చలించువేళ ఏర్పడు శబ్దము ఎంతో విలువైన అర్థముతో కూడి ఉన్నది. కనుక మాణిక్యముతో సమానముగా పోల్చడ మైనది.

**ఆ ॥ చిలుక పలుకులందు చిత్రమై యున్నవి**
**పలుకు లోను పలుకు పదిల పరచి**
**వలపు పుట్టినట్లు వచియింపు చున్నది**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 15**

**భావము :** ప్రతి శరీరములో జీవాత్మలకు సాక్షిగయున్న ఓ ఆత్మా! వినుము. శ్వాస పక్షిలాంటిదన్నాము కదా! ఆ పక్షి చేయు శబ్దము చాలా చిత్రముగా

ఉన్నది. ఆ శబ్దము శరీరములో “సోహం” గా వినిపించుచున్నది. ఆ “సోహం” శబ్దము లోపల “ఓం”యను శబ్దము ఇమిడి ఉన్నది. దాని విషయము తెలిసినవారు ఓం అను శబ్దము ఆత్మ నుండి వచ్చుచున్నదని ఓం కారమునకు మూలమైన ఆత్మను పొందవలెనని అనుకొందురు.

**విశేషార్థము :** “సోహం”యందే “ఓం” ఇమిడి ఉన్నది. కావున “పలుకులోను పలుకు” అని పద్యములో చెప్పబడినది.

**ఆ ॥ వలపు జెందిరయ్య వనితలు మగవారు**
**పరమ చిలుక కొరకు పరుగులెత్తి**
**పట్టలేక తుదకు భ్రాంతుల పాలైరి**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 16**

**భావము :** ఇంద్రియములకు శక్తి నొసగు ఓ ఆత్మా! వినుము. “ఓం” కారమును తెలిసిన స్త్రీ, పురుషులందరూ అది ఏ శక్తిచే ఉద్భవించుచున్నదో ఆ శక్తిని తెలుసుకొనుటకు ఆశ చెంది ప్రయత్నము చేయుచున్నారు. ఆత్మ శక్తిని తెలుసుకోలేక చివరకు చాలామంది మాయలోనే మునిగిపోయారు.

**ఆ ॥ పట్ట తరము గాదు పాతాళమునంటి**
**బ్రహ్మ పట్టనమునకు బారుచుండు**
**భ్రమలు విడచి దాని ప్రాప్తిని గనవలె**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 17**

**భావము :** కొలిమిమంటకు గాలితిత్తి, తిత్తికి కదలించు కట్టె, కట్టెకు చివర కూర్చొని కదలించుచున్న వ్యక్తి ఎలాగ అనుసంధానమై ఉన్నారో అలాగే శరీరములో ముక్కులోని శ్వాసకు ఊపిరితిత్తులు, తిత్తులకు బ్రహ్మనాడి, నాడికి చివరలో అన్నిటిని కదలించు ఓ ఆత్మా! శ్వాసను చలింపజేయు

శక్తి మన శరీరములో బ్రహ్మనాడియందు ఇమిడి ఉన్నది. బ్రహ్మనాడి యందున్న శక్తియే శ్వాసకు కారణము అదియే శ్వాసకంటే వేరై దానికి ఆధారముగా ఉన్నది. కావున దానిని 'పరమ చిలుక' అని పిలుస్తున్నాము. ఆ పరమ చిలుక అనబడు శక్తి బ్రహ్మనాడి చివరి భాగము మొదలుకొని పైన కపాల స్థానము వరకు వ్యాపించి ఉన్నది. ఆ శక్తిని తెలుసుకోవల యునంటే ప్రపంచ భ్రమలు విడచి, అన్ని విషయములను మనసుచే మరపించ వలయును. అట్లు చేసినపుడే శ్వాసకంటే పరముగా ఉన్న శక్తి, శ్వాసను నడిపించు ఆ ఆత్మ శక్తి మరియు బ్రహ్మనాడి ఆధార కమలము నుండి సహస్రార కమలము వరకు వ్యాపించి ఉండు శక్తి తెలియును. అదియే ఆత్మ దర్శనమని చెప్పవచ్చును.

**ఆ ॥ సాధ్యపడదు ఎంత సామంతుడైనను**
**సత్యశాంత సమర సాత్మ్యుడైతె**
**మోహ మొందునయ్య మోక్ష కాంతామణి**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 18**

**భావము :** శరీరములో శ్వాసను నడిపించు ఓ ఆత్మా! వినుము. బ్రహ్మనాడి యందుండు ఆత్మశక్తి మనకున్న ధనికత్వమునకు గానీ, సార్వభౌమత్వమునకు గానీ లొంగునది కాదు, తెలియునది గాదు. గుణములన్నింటినీ శాంతింప జేసినవారికి, అన్ని జీవులందున్న ఆత్మ సమముగా ఉన్నదను భావము కలవారికి చైతన్యమైన ఆత్మ తెలియును తర్వాత మోక్షము పొందవచ్చును. మోక్షమను కన్య ధనికులకు లొంగదు. జ్ఞానులకు మాత్రము తన సుఖమును అందివ్వగలదు. వారితోనే కూడి ఉండి పరమ సుఖముననుభవింప జేయును.

**ఆ॥ శాంతి మతిని బూని చాదస్తములు మాని**
**చింతదీర గురుని సేవ జేసి**
**పంతగించి ముక్తి పడతిని గనవలె**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 19**

**భావము :-** సమస్త జీవులందు ఒకే పని చేయుచున్న ఆత్మా జీవుడైన నేను చెప్పుమాట వినుము. మనస్సులో ఆలోచనలను చేరనీయక ఉపవాసములు వ్రతములు, యజ్ఞములనీ చాదస్తముల పని చేయక, శరీరములోని మనస్సు యొక్క చింతలన్నీ పోవునట్లు గురువు చేత జ్ఞానము తెలిసినవాడవై, గురువు యొక్క సేవ చేస్తూ మాయ దాడికి తట్టుకొని ప్రయత్నమును గట్టిగా చేయుచూ మోక్షమును పొందవలెను. అలాకాక దేవుడు చెప్పినట్లు యోగము ఆచరించక యజ్ఞములనీ, వేదాధ్యయణములనీ, తపస్సులనీ చాదస్తములైన పనులు చేయుచుండినా ఎప్పటికీ మోక్షము పొందలేరు.

**ఆ॥ ముక్తి కాంత ఎంత మూర్ఖురాలో గాని**
**చిక్కు బెట్టునెట్టి సిద్ధునైన**
**జిక్కదయ్య అల్పచీకాకు మతులకు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 20**

**భావము :-** రెండవ ఆత్మవై శరీరములో అన్ని పనులు చేయుచున్న ఓ ఆత్మా! వినుము. మోక్షమను దానిని చాలామంది ఆశిస్తుంటారు. కావున మోక్షమును ఒక ముక్తి కాంతలాగా పోల్చి చెప్పుకుందాము. ఒక స్త్రీ స్నేహము కావాలంటే సినిమాల్లో హీరోల్లాగా ఎన్నో తంటాలు పడవలసి ఉన్నది. అట్లని హీరోయిన్‌లాగా సులభముగా ముక్తి కాంత చిక్కునది కాదు. ఎన్నో సత్‌ప్రవర్తనలుండినా, ఎన్నో భక్తి పనులు చేసి చూపించినా, నీవు తప్ప నా దృష్టిలో ఎవరూ లేరనినా ముక్తి అంత సులభముగా వచ్చునది

కాదు. అందువలన చాలామంది దైవమార్గములో నడచి తాము అనుకొన్నట్లు ముక్తి లభించలేదని చీకాకు పడి **'అందని ద్రాక్ష పుల్లన'** అన్నట్లు దైవాన్ని నిందించిన వారు కూడా కలరు.

దేవున్ని తెలుసుకోవడమే ముక్తి, దేవునియందైక్యమవడమే ముక్తి. దేవున్ని తెలుసుకోవడము అంత సులభము కాదు. దేవాలయములో ప్రతిమ చుట్టూ మాయ ఆవరణము యొక్క గుర్తుగా సింహతలాటమున్నట్లు దేవుని చుట్టూ మాయ గలదు. దేవుని చేరాలనుకొన్న వారినందరినీ దేవుని చుట్టూవున్న మాయ ఎన్నో చిక్కులు పెట్టి చివరకు వానిలోని ఓపిక నశించునట్లు చేయును. అటువంటపుడు కొందరు అల్పచికాకులు విసుగు చెంది దేవుని మార్గమునే వదిలి వేయుదురు. అందువలన ముక్తి అనునది సులభముగా దొరుకునది కాదని పెద్దలు చెప్పారు. ఎన్ని కష్టములొచ్చినా, ఎన్ని మనోచోదనలొచ్చినా పట్టువదలక ప్రయత్నించు వానిని మాయ ఏమీ చేయలేదు. ముక్తి తప్పక లభించును.

**ఆ॥ తామసంబు విడక తత్వంబు గనరాదు**
**రాజసంబు విడక రాదు ముక్తి**
**సాత్త్వికంబు మోక్ష సాధనంబై యుండు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 21**

**భావము :–** శరీరములో నివాసముంటున్న మూడు ఆత్మలలో అహర్నిశలు జీవున్ని కాచుకొని యుండు ఓ రెండవ ఆత్మా! వినుము. ఇస్లాం మతములో **సైతాన్** అని చెప్పబడునది మరియు క్రైస్తవమతములో **సాతాన్** అని చెప్పబడినది ఇందూమతములో **మాయ** అను పేరుతో చెప్పబడుచున్నది. సర్వ సృష్టికి అధిపతియైనా పరమాత్మయే మాయను సృష్టించాడు. జగత్తులోని సర్వజీవరాసులను వాటి కర్మానుసారము నడుపుటకు మాయను

పరికరముగా దేవుడు పెట్టుకొన్నాడు. సర్వజగత్తును నడిపించు యంత్రాంగములో మాయపాత్ర కొంత మరియు ఆత్మపాత్ర కొంత శరీరములో ఉండునట్లు దేవుడు చేశాడు. ఆత్మ శరీరమునకు శక్తి ఆరోగ్యమును కర్మ ప్రకారమివ్వగా, మాయ మనిషి సామాజిక జీవనములో లగ్నమగునట్లు దేవునివైపు, ఆధ్యాత్మిక జీవనము వైపు లగ్నము కానట్లు చేయుచున్నది. మాయ మన శరీరములో ఎట్లున్నదనగా!

మాయ మూడు భాగములై మూడు గుణములను పేర్లతో ఉన్నది. మూడు గుణభాగములలో ఒక్కొక్క భాగము 108 భాగములుగా విభజింప బడి ఉన్నది. ఆ గుణభాగముల పేర్లు ఒకటి తామసము, రెండు రాజసము, మూడు సాత్త్వికము అని గలవు.

మాయకు సంబంధించిన మూడు గుణ భాగములను వదలినపుడు మోక్షమును పొందుటకు సాధ్యమగును. సాత్వికమనునది మిగతా రెండు గుణ భాగములకంటే కొంత ఉత్తమమైనదిగా ఉండి భక్తి మార్గమును కలుగ జేయును. సాత్త్విక చింతనతో కొంత భక్తి మార్గము కల్గించి నేను మోక్ష మార్గములో యున్నానని భ్రమింపచేయును. అసలయిన దేవుని మార్గము చూపునది ఏ గుణము కాదు కావున సాత్త్విక గుణము వలన కలిగిన విశ్వాస మార్గము పరమాత్మది కాక మిగతా అన్యదేవతలదై ఉండును. అది భక్తిమార్గమే ఐనప్పటికీ సృష్ఠికర్త అయిన పరమాత్మ యొక్క మార్గము కాదని తెలియాలి. సాత్త్వికము మోక్షసాధనమైనట్లు భ్రమింపచేయుచుండును. అలాగే రాజసములోని గుణములను, తామస గుణములను వదలనిదే నిజ దైవమార్గము తెలియదు.

కొందరు తపస్సులకు, సిద్ధులకు సాత్త్విక గుణములుండి అన్య దేవతారాధకులై యుండుట వలన, మరికొందరు సాత్త్విక భ్రమలో పడి

యజ్ఞములు చేయుట వలన పూర్తి మోక్షము పొందలేక పోవుచున్నారు. సాత్త్వికము మోక్ష సాధనమని భ్రమింపచేయుట వలన మరియు రాజసము పేరు ప్రఖ్యాతుల మీద భ్రమ కల్గించుట వలన తామసము అన్నిటికీ తక్కువ గుణమై యుండుట వలన, మూడు గుణ భాగములు మాయకు ప్రతి రూపమై నిలిచి యున్నవి, అందువలన వాటిని విడువక ముక్తి దొరకదు.

**ఆ॥ మనసు జారవిడచి మమకారమణచక**
**మునులు కొందరు భ్రమ మునిగినారు**
**నరుడు స్థిరము గనుట నమ్మరాదా మాట**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 22**

**భావము :–** ముగ్గురు పురుషులలో మధ్యవాడవై పూజ్యుడవైవున్న ఓ ఆత్మా! వినుము. నరుడు తన శరీరములోని తతంగమును తెలియక, తన శరీరములోని అంతరంగ భాగములను గుర్తించక, బయటి ప్రపంచపు పనులలో లగ్నమైపోయాడు. సాధారణ మనిషికాక కొంత జ్ఞానమున్న మునులు కూడా తమలోని మనస్సు యొక్క వివరము పూర్తిగా తెలియక తమ పట్టునుండి మనసును జారవిడుచుకొనుచున్నారు. మనస్సు చలించు స్వభావము గలది. దాని చలనమంతయూ గుణ విషయాల మీదికే ఉండును. ఎన్నో గుణవిషయములను రేకెత్తించు మనసును జయించలేక మరియు **నేను** అను అహము కలిగి, నాది, నా వారను విషయముల వదలక గుణముల భ్రమలలో మునిగి పోయారు. శరీరములోని మనస్సును అహమును ముఖ్యముగా జయించవలసి ఉన్నది. ఎందుకనగా మనస్సు గుణ విషయముల మీదికి పోయి జ్ఞాపకము తేగా, అహము వాటిలోని కర్మను అంటగట్టుచున్నది. వీటిని జయించితే గీతలో చెప్పబడిన బ్రహ్మ యోగము, కర్మయోగము రెండు ఆచరించినట్లగును. కానీ ఇవి అంత సులభమైనవి కావు, పెద్ద మునులు సహితము వీటి వివరము తెలియక

భ్రమలో మునిగి పోయారు. ఇక సాధారణ వ్యక్తి మనసును జయించినా డంటే ఆ మాటను నమ్ముటకు వీలులేదు.

**ఆ ॥ మొదట మనసు జయము ముఖ్యయోగంబని**
**తెలియలేక ధరణు దిరిగెనేని**
**కుదర కక్కసించి కుక్కలాగ చలించు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 23**

**భావము :-** సమస్త సజీవ శరీరములందు నఖ శిఖ పర్యంతము వ్యాపించి శరీరములోని అన్ని అవయములచేత పనులు చేయించుచున్న ఓ ఆత్మా! వినుము. మనస్సును జయించడము వలన యోగము లభించుననీ, ఆత్మ తెలియుననీ ముఖ్యమైన కార్యమదియేననీ, మన శరీరములో మనతో పాటు ఆత్మ పరమాత్మ నివాసమున్నవనీ ముందు ఆత్మను తెలియడము వలన కర్మనాశనమై పరమాత్మ తెలియును, ఈ విధానము తెలియక మనస్సు జోలికిపోక తన శరీరములో వెదకక భూమి మీద దేవున్ని తెలుసుకొను నిమిత్తము ఎన్ని తీర్థ యాత్రలు జరిపినా, ఎన్ని పుణ్యక్షేత్రములు సందర్శించిన మనలోని మనస్సు మాత్రము నిలువక, కుక్కవలె నిలకడ లేనిదై చలించు చూనే ఉండును. మనస్సు నిలువనిది ఆత్మ యొక్క అనుభూతి ఎవరికీ తెలియదు.

**ఆ ॥ కుక్కవంటి మనసు కుదురగ జేసియు**
**నిటల మధ్య దృష్టి నిలిపెనేని**
**పటుతరైక్య బ్రహ్మ భావంబు కల్గును**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 24**

**భావము :-** శరీరములోని జీవునికి సాక్షిగానున్న ఓ ఆత్మా! వినుము. మనస్సు యొక్క విషయము దాని మీద ధ్యాస లేనివారికి తెలియదు.

మనస్సు మీద బుద్ధి లగ్నము చేసి చూచినపుడు మనస్సు ఏ విషయము మీద నిలబడక విషయములను మార్చి మార్చి బుద్ధికి చూపుచుండును. ఇంద్రియ విషయములు వద్దని, కొంతసేపు ప్రపంచపు విషయములను చూపవద్దని మనస్సుకు బుద్ధి ఎంత చెప్పినా మనస్సు మాత్రము తన అలవాటు ప్రకారము పంచభూతములకు పంచేంద్రియములకు సంబంధించిన విషయములనే మననము చేయుచుండును. అనేక విషయముల మీదికి సంచరించుట వలన మనస్సును చంచలము కల్గిన కుక్కతో సమానముగా పోల్చి చెప్పారు. కుక్కవంటి చలనము కల్గిన మనస్సును అభ్యాసము చేత విషయచింతనల మీదికి పోకుండా చేసి మనోదృష్ఠిని కనుబొమ్మల మధ్య తల లోపలి మధ్య భాగమున నిలుపగలిగితే అక్కడ గల బ్రహ్మనాడిలోని ఆత్మ యొక్క విషయము తెలియును. మనస్సు యొక్క కర్తవ్యము అహర్నిశలు బుద్ధికి ఏదో ఒక విషయమును తెలియ జేయడము. దానికి మొదటి నుండి బయట ప్రపంచ విషయములను తెలియ జేయడము అలవాటైనది. మనస్సు యొక్క ఆ అలవాటును మాన్పి లోపలి ఆత్మ విషయముల మీదికి మళ్లించడమే యోగము అంటాము.

**ఆ ॥ అప్పుడాత్మాయందు అధిక విశ్రాంతియు**
**గల్గి చంచలంబు గట్టి పోయి**
**గాలి లేని దివ్వెగ ప్రకాశించు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 25**

**భావము :-** పూల హారములో ఆధారమై దాగియున్న దారమువలె శరీరములో కనిపించక, శరీరమునకంతటికీ ఆధారమైయున్న ఓ ఆత్మా! వినుము. మనస్సు యొక్క చంచలము అగిపోయినపుడు గాలి లేనిచోట దీపము కదలక వెలిగినట్లు, మనస్సుకు ఒక్క కుదుపు కూడా లేక కదలికలు

శూణ్యమై పోవును. అటువంటి సమయములో బయటి జ్ఞానేంద్రియముల నుండి వచ్చు సమాచారమును మనస్సు స్వీకరించడము గానీ, లోపలి బుద్ధికి చేర్చడము గానీ జరుగదు. అలా మనోస్తబ్ధత ఏర్పడినప్పుడు బుద్ధి ద్వార జీవుడు అనుభవించు విషయము లేకుండా పోయి మిక్కిలి విశ్రాంతి ఏర్పడుచున్నది. మెలుకువలో ఎల్లపుడూ ఏదో ఒకటి అనుభవించుచు ఏమాత్రము విశ్రాంతి లేని జీవునికి విశ్రాంతి కల్గడము మనో నిలకడ కల్గిన ఒక్క బ్రహ్మయోగములోనే సాధ్యమగును. ఇక్కడ ఆత్మ అనిన మొదటి ఆత్మ అయిన జీవాత్మయని అర్థము చేసుకోవలెనని తెలియుము.

**ఆ ॥ చూపు నిల్వకున్న సుఖమెందు గనరాదు**
**మనసు నిల్పకున్న మమత విడదు**
**చూపు మనసు నంటి చూచుర సుజ్ఞాని**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 26**

**భావము :-** శరీరాంతర్గతములలో ఉండి జ్ఞానము చేత పొగడబడు ఓ ఆత్మా! వినుము. మన శరీరములో ఐదు చూపులు గలవు. కంటికి మాత్రము ఒక్క చూపున్నది. మిగతా నాలుగు చూపులెక్కడున్నాయని ఆశ్చర్య పడనవసరము లేదు. కంటికి దృశ్యమును చూచే చూపుంటే, నాలుకకు రుచిని చూచే చూపుగలదు. ముక్కుకు వాసనను చూచే చూపుగలదు. అలాగే చెవి, చర్మములకు శబ్ద, స్పర్శలను గ్రహించే చూపు కలదని తెలియవలెను. ఐదు జ్ఞానేంద్రియములకున్న ఐదు గ్రాహిత శక్తులను ఐదు చూపులుగా పై పద్యములో చెప్పారు. **"చూపు నిల్వకున్న సుఖమెందుగనరాదు"** అనడములో ఐదు ఇంద్రియములను అణచివేయకపోతే యోగ విషయము తెలియదని అర్థము. ఐదు ఇంద్రియములను ఆధారము చేసుకొని తిరుగుచున్న మనస్సును లోపలి గుణముల మననము నుండి నిలుపక పోతే **నేను** అను అహము విడువదు. అందువలన బ్రహ్మజ్ఞానము తెలిపిన సుజ్ఞాని బయటి

ఇంద్రియ విషయములను లోపలి గుణముల విషయములను రెండింటినీ మనస్సుకు చేరనీయక మధ్యలోనున్న బ్రహ్మనాడిలోని ఆత్మను చూచునట్లు చేయుచుండును. అటు బయటి ఇంద్రియములను, ఇటు లోపలి గుణములను రెండింటినీ అంటుకొని వాటి వరకూ వ్యాపించి ఉన్న ఆత్మను తెలియుట వలన పద్యములో **"చూపు మనసు నంటి చూచుర సుజ్ఞాని"** అన్నారు.

**ఆ॥ రెండు గిరుల మధ్య రేవతి యను చుక్క**
**చుక్క నడుమ నుండు సుధపురంబు**
**పురమునంటి చూడ పురుహరుడచటుండు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 27**

**భావము :-** సమస్త జీవ శరీరములలో మూడు గుణముల మధ్య సాక్షిగా యున్న ఓ ఆత్మా! వినుము. మనశరీరములో సూర్యచంద్రనాడుల మధ్య బ్రహ్మనాడి కలదు. ఆ బ్రహ్మనాడియందు నాశనరహితమైన శక్తి ఇమిడి ఉన్నది. మనస్సును బ్రహ్మనాడియందలి శక్తిలో ఐక్యము చేసిన నిజమైన ఆత్మ తెలియగలదు.

**విశేషార్థము :-** రెండు గిరులనగా మన శరీరములోని సూర్యచంద్ర నాడులని తెలియవలెను. శరీరములోని మిగతా నాడులకన్నిటికంటే ఇవి పెద్దవిగా యున్నవి. కావున వీటిని కొండలుగా పోల్చి చెప్పారు. సూర్యచంద్ర నాడుల పై భాగము నుండి వ్యాపించిన బ్రహ్మనాడిని కొండలపైన నక్షత్రముగా చెప్పడమైనది. నక్షత్రములలో రేవతి యను నక్షత్రము ఎక్కువ ప్రకాశము కలది. అలాగే బ్రహ్మనాడి నాడులన్నిటిపై ప్రశస్తి కలది. కావున బ్రహ్మనాడిని రేవతి చుక్కగా పోల్చడమైనది. బ్రహ్మనాడి లోపల చైతన్యశక్తి యున్నది. అదియే నాశనము లేని ఆత్మశక్తి అందువలన దానిని అమృత పురముగా పోల్చడమైనది. ఆ శక్తిలో ఐక్యమైనవానికి ఆత్మయంటే ఏమిటో, ఎవరో

తెలియును. అందువలన **"పురమునంటి చూడ పురహరుడచటుండుయని"** ఆత్మను అన్నారు. బ్రహ్మనాడిలోని చైతన్యమునకు కారణమైన వాడే ఆత్మ. అందువలన ఆత్మ 'పురహరుడని' పిలువబడుచున్నాడు.

**ఆ॥ మనసు నిల్పి యముని మర్మంబు దెలిసితే**
**తన పురాకృతంబు తప్పిపోయి**
**పరమ యోగమునకు బాటయు గల్పించు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 28**

**భావము :–** అఖిల జీవులతో కూడియున్న ఓ ఆత్మా! వినుము. అతిదృఢమైన, బలమైన, నీచమైన మరియు చంచలమైన మనస్సును నిలుపగలిగి జగతికి యముడైన ఆత్మను తెలుసుకొంటే, తన పూర్వజన్మలలో చేసుకున్న కర్మమంతయూ తొలగిపోయి, మరు జన్మము లేకుండా పోవును. జన్మకు కారణమైనది కర్మ, కర్మ యనగా పాప పుణ్యములు. పుణ్యము వలన సుఖము, పాపము వలన కష్టములు సంభవించుచుండును. పాప పుణ్యములు మిశ్రమముగాయున్న యెడల జీవితములో కష్ట సుఖములు మిశ్రమముగా సంభవించును. కావున యమలోకమెక్కడున్నది, యముడు ఎక్కడున్నది, యమకింకరులు యెక్కడున్నారను విషయము తెలుసుకొంటే ముందు జన్మలో చేసుకొన్న పాపపుణ్యములను అనుభవింపక తప్పించు కోవచ్చును.

మనస్సును నిలిపినచో ఆత్మను తెలుసుకొనుటకు వీలగుచున్నది. ఆత్మను తెలుసుకొను అవకాశము లభించిన తర్వాత దాని మహత్యమును తెలియును. అపుడు ఆత్మయే యముడుగానున్నాడను యధార్థము తెలియును. మనస్సు నిల్పి ఆత్మ మర్మము తెలుసుకొన్న వానికి జ్ఞానాగ్ని ప్రజ్వరిల్లును. ఆయగ్ని పూర్వ జన్మములలో చేసుకొన్న కర్మలనన్నిటినీ కాల్చివేయును. కర్మములన్నిటినీ కాల్చివేసుకొన్నవాడు యోగమును వీడి

పరయోగములో చేరుచున్నాడు, అనగా శరీరమును వదలి పరమాత్మలో ఐక్యమైపోవును.

**విశేషార్థము :-** శరీరములో కాలచక్రమున గల నవగ్రహములను కర్మకు అనుగుణముగ చలింపజేస్తూ, జీవుల మీద నవగ్రహముల ద్వారా కర్మను అనుభవింపజేయువాడు ఆత్మ. అందువలన ఆత్మను యమునిగా పోల్చడ మైనది. ఆత్మను తెలియడమే యముని మర్మము తెలియడమని పోల్చి చెప్పారు.

జీవుడు శరీరములో ఉన్నపుడే యోగము చేయనగును. శరీరమును వదలిన తర్వాత పరమాత్మలో ఐక్యమైపోవును. శరీరము లేకుండా దేవుని యందు ఐక్యమగు దానిని పరయోగమని (పరమ యోగమని) చెప్పబడినది. పరయోగమంటే యోగముకంటె వేరైనదని అర్థము. ఆత్మకంటే పరముగా యున్న పరమాత్మలో ఐక్యమగుటనే యోగముకంటే పరముగానున్న పరయోగమనుచున్నాము.

**ఆ ॥ మండలముల మూటి మద్య షోడశ**
**కళను పూర్ణ చంద్రకాంతి యుండు**
**కాంతి యందు మనసు కలసిన యోగంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 29**

**భావము :-** సమస్త జీవరాసుల యందుగల మూడు ఆత్మలలో మధ్యనున్న ఓ ఆత్మా! వినుము. ప్రపంచములో జనాభా ప్రాతిపదికగా గానీ లేక విస్తీర్ణ ప్రాతిపదిక ఆధారముగా గానీ మండలము అని కొంత ఏరియాను అంటున్నాము. శరీరముతో నివశించు మనము ఫలానా మండలములో ఉన్నామని చెప్పుకొనుటకు అడ్రసు గలదు. శరీరముతోనున్న మనకు భూమి మీద ఫలానా ప్రదేశమని చెప్పుకొన్నట్లు శరీరము లోపల జీవాత్మయైన మనము నివశించు అడ్రసు కూడా కలదు. పైన ఫలానా

మండలములో నివశిస్తున్నామన్నట్లు, లోపల కూడా ఫలానా మండలములో నివశిస్తున్నామని చెప్పవచ్చును. జనాభా సంఖ్యనుబట్టి, విస్తీర్ణమునుబట్టి బయట మండలములను నిర్ణయించి ఏర్పరచినట్లు, శరీరము లోపల కూడా గుణముల సంఖ్యనుబట్టి, అవి గల విస్తీర్ణమునుబట్టి మూడు మండలములు ఏర్పరచబడినవి. 108 గుణముల సంఖ్యను బట్టి వాటికి కొంత విస్తీర్ణము నిర్ణయించబడి ఉన్నది. దానినే శరీరములోని మండలము అంటున్నాము. ఇటువంటి మండలములు మూడు గలవు. ఈ మూడు మండలములు ఒక దాని తర్వాత ఒకటి చక్రమువలె చుట్టు కొలత కల్గి ఉన్నవి. వీటినే త్రిగుణ మండలములని అంటున్నాము. ఈ మూడు మండలముల మధ్యలో ఆత్మ నివాసముంటున్నది. ఆత్మ నివాసమైన స్థలమును గుణములు నివాసమైన మూడు మండలముల స్థలమును నెమలి పింఛములో నాల్గు గుండ్రని భాగములుగా చూడవచ్చును. శరీరములోని గుణములను ఆత్మ యొక్క ప్రత్యేకతను తెల్పు అమరిక ఒక్క నెమలి పింఛమునకు మాత్రమే గలదు. కావున శ్రీకృష్ణుడు నెమలి పింఛమును తన తలమీద ధరించి ఇవి తలలో గలవని చూపించాడు.

మూడు గుణముల మధ్యలో ఆత్మ నివాసమై యున్నది. మూడు గుణముల మధ్యనున్న ఆత్మ ప్రకాశవంతమై తన ప్రకాశమును శరీరమంతటా వ్యాపింపజేయుచున్నది. జ్ఞానమునకు కేంద్రము ఆత్మని పెద్దలు చెప్పినట్లు జ్ఞానము వలన తెలియబడునది కూడా ఆత్మయే. అందువలన ఆత్మను జ్ఞానమునకు చిహ్నమైన చంద్రునితో పోల్చి, ఆత్మ వ్యాపించిన శక్తిని చంద్రకాంతితో పోల్చారు. ప్రకాశించు రత్నము పదహారు మెరుపులతో ఉండును. పూర్వము రత్నమును సానబట్టితే పదహారు పచ్చములుగా (సమతలముగా) సానబట్టెడివారు. రత్నమును ఎటు తిప్పినా మెరిసేది. దానివలన షోడశ కళల రత్నమనెడివారు. పదహారు మెరుపులను పూర్తి

కాంతిగా చెప్పెడివారు. అలాగే ఆత్మ యొక్క జ్ఞానము కూడా పూర్ణ ప్రకాశము కల్గిన చంద్రకాంతితో సమానముగా చెప్పబడినది. శరీరము లోపలి ఆత్మలో మనసు లగ్నము చేసినపుడు బ్రహ్మయోగమగును. ఆ విషయమును చెప్పుచూ **"కాంతి యందు మనసు కలిసిన యోగంబు"** అన్నారు. మూడు గుణములకంటే ముఖ్యమైనది వాటి మధ్యనున్న ఆత్మనీ, దానియందే లగ్నము కావలెననీ, దానినే తెలియవలయునని తెలుపు నిమిత్తమే నెమలిపింఛములో మూడు ఆవరణముల మధ్యలో గల రంగు చాలా గాఢముగా కనిపిస్తు గుర్తింపుగానున్నది. పై పద్యము బ్రహ్మయోగమును గురించి చెప్పినదని తెలియవలెను.

**ఆ ॥ మూడు యేర్లు పొంగి ముల్లోకములు కృంగ**
**ముంచి వేయు సంగమూల మేమో**
**గాంచలేని యోగి ఘనుడెట్టులాయెరా**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 30**

**భావము :-** చిన్న చీమలోను, పెద్ద ఏనుగులోను ఒకే విధానము కల్గి కర్మను పాలించు ఓ ఆత్మా! వినుము. తామసము, రాజసము, సాత్త్వికము అను మూడు పెద్ద నదులు మన శరీరములోనే గలవు. మూడు లోకములుగా విభజింపబడిన తామసులు, రాజసులు, సాత్త్వికులు అను ప్రజలు గుణములను నదీ ప్రవాహములకు తాళలేక వాటియందు మునిగి పోవుచున్నారు. అందరినీ ముంచివేయు మూడు గుణములనెడి మాయను ముంచివేయు ఆత్మ కూడా అక్కడే అన్నిటికీ మధ్యలో గలదు. మూడు గుణములలో మునిగిపోయిన వారెవరైన జ్ఞానము ద్వారా తెలియునది మధ్యలోగల ఆత్మయే. ఎవరైనా మూడు గుణములను వదిలితే చేరు చోటు ఆత్మయే. అందువలన అందరికీ సంగమూలము ఆత్మయై ఉన్నది. ఆత్మ మూడిటికీ మధ్యనున్న త్రివేణి సంగమములాంటిది. సూర్య చంద్ర బ్రహ్మనాడులు

కలియుచోటున్న ఆత్మను తెలియలేనివాడు ఎప్పటికీ బ్రహ్మయోగి కాలేడు. శరీరములోని ఆత్మను తెలియనివాడు ఘనుడు కాలేడు.

**ఆ ॥ మాటలు బహునేర్చి మర్మజ్ఞులను గాంచి**
**వారితోను భేద వాద మాడ**
**కరిని గాంచి కుక్క కరువబోవు చందంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 31**

**భావము :-** శరీరములోని అన్ని భాగములకు శక్తి నిచ్చుచూ ఎవరికీ తెలియకుండవున్న ఓ ఆత్మా! వినుము. మర్మజ్ఞులు అనగా మర్మమును తెలిసినవారు లేక రహస్యమును తెలిసినవారని చెప్పవచ్చును. ప్రపంచములో అన్నిటికంటే పెద్ద రహస్యము తన శరీరములో దాగియున్న ఆత్మను తెలియడమే. తాను తన శరీరములోనే వెదకి తనకు తెలియకుండా తనకంటే భిన్నముగా లేక తనకంటే వేరుగా శరీరములో ఉంటూ శరీర కార్యములన్నీ తనకు తెలియకుండానే చేయుచున్న ఆత్మను తెలియడము ప్రపంచములో అన్నిటికంటే పెద్ద రహస్యమును తెలిసినట్లగును. **అజ్ఞుడు అనగా తెలిసినవాడు అని అర్థము. మర్మజ్ఞుడు అనగా ఆత్మను తెలిసిన వాడనియే చెప్పవచ్చును.** తనకంటే వేరుగా ఎవరికీ తెలియకుండా జన్మ జన్మలకూ తన వెంటనున్న ఆత్మను తెలిసినవారిని చూచి కొందరు మాటలు ఎక్కువగా నేర్చినవారు కవులు, భాషా పండితులు తమ వాక్చాతుర్యము చేత ఆత్మజ్ఞులతో భేదవాదము చేయుచుందురు. మాటల నైపుణ్యత లేని యోగుల వద్ద తమలోని పాండిత్యమునంతయూ ఒలకపోయుచుందురు. వేయిమంది పండితులు తెలియని ఆత్మను ఊహించుకొని, చివరికి తానే ఆత్మయని సాధన ఫలితమదియేనని ఒకరు తర్వాత మరొకరు చెప్పుచున్నారు. సత్యము తెలియనివారు ఎలా ఎంత చెప్పినా వారికి ఆత్మ రహస్యమైనదే అగుచున్నది. ఆత్మను తెలిసినవాడు ఒక్కడున్ననూ వాడు వేలమంది

వాదననయినా ఒప్పుకోడు. తనకు రహస్యము తెలిసిన దానివలన ఒక్క బ్రహ్మయోగికి తప్ప ఆత్మ ఎవరికీ తెలియదని తెలిసినవాడు, తాను వేరు ఆత్మవేరుగా శరీరములో ఉన్నానని, శరీరము లోపల జరిగెడి పనులను తాను ఏమాత్రము చేయలేదనీ, శరీరమంతా ఆత్మ వ్యాపించి ఉండగా శరీరములో సూది మోపినంత జాగాలో మాత్రమే తానుగలననీ చెప్పగలడు. అటువంటి మర్మజ్ఞుల వద్ద పండితులు చూపు పాండిత్యము ఏనుగు ముందర కుక్క మొరిగినట్లని తెలియవలెను.

**ఆ ॥ మాటలాడినట్లు మరి వేద సిద్ధాంత**
**మార్గమందు మనసు మనుపలేని**
**మాట కుమ్మరింట మసి కుండ చందంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 32**

**భావము :-** నా శరీరములో నాకు తెలియకుండా నిదురలోనూ, మెలుకువ లోనూ నాయందు పనిచేయుచున్న ఓ ఆత్మా! వినుము. కొందరు కొన్ని పుస్తకములు చదివియో లేక కొందరి బోధకుల మాటలు వినియో ఆధ్మాత్మికమును కొంత తెలిసి దానిని మాటల రూపముగా మాట్లాడు చుందురు. ఎదుటివాని నోరు మూయించు స్థోమత తన మాటలలో ఉండినప్పటికీ, తనది నిజమైన జ్ఞానమే అయినప్పటికీ, దానిని ఆచరణలో పెట్టినపుడే జ్ఞానమార్గమందు నడచినట్లగును. ఉదాహరణకు జ్ఞాన విషయములలో ప్రపంచమునకంతటికీ, ప్రజలందరికీ అధిపతియైన దేవుడున్నాడనీ ఆ దేవుని తప్ప మిగతా వారిని ఆరాధించకూడదనీ మాటల రూపములో వాదించి శాస్త్రబద్ధమైన జ్ఞానమనిపించుకొన్నవాడు తాను మాత్రము అసలయిన దేవుని ధ్యాస మరచి చిన్న చిన్న చిల్లర దేవతలను పూజించడములో పాలుపంచుకోవడము, ఊరి పెద్దను కాబట్టి మొదటి పూజ నా ద్వారానే జరుగవలెనని అనుకోవడము, లేకపోతే చిల్లర దేవుళ్ల

పూజలకు చందాలివ్వడము మొదలగునవి చూస్తే, వానికి తెలిసిన జ్ఞానము సరియైనదయినప్పటికీ అది మాట్లాడు వరకే గానీ ఆచరణవరకు లేదని తెలియుచున్నది. ఒక వంటను వండు విధానము తెలిసినంత మాత్రమున మన ఆకలి తీరదు. తెలిసిన విధానము ప్రకారము వండినపుడు దానిని తినగలము, ఆకలి తీరగలదు. అట్లు కాక బియ్యమును నానబెట్టి రుబ్బి సోడాపొడి కలిపి వెడల్పు పెనము మీద వెడల్పుగా రుబ్బిన పిండిని పోసి నెరపితే, పొయ్యి అగ్నికి పెనము శాకమెక్కి పిండి కాలి దోశ అగునని తెలిసి రుబ్బడములోనూ, సోడాపొడి కలపడములోనూ చివరికి పెనము మీద కాల్చడములోనూ అనుభవమున్నపుడే దోశ తయారయి తినగలము. అట్లుగాక మాటల వరకే దోశ అయితే దానిని తిని అనుభవించలేము. వేదాంత విషయములో కూడా ఆచరణలేని జ్ఞానము కుమ్మరింటి కుండ వాగినట్లు వాగుటకు పనికి వచ్చును కానీ, జీవితము నుండి విముక్తి పొందుటకు పనికి రాదు.

**ఆ ॥ దారుణాది యోగంబు దారెరింగిన యోగి**
**మేరునందు చేరి మేను మరచి**
**తాను తాను యనెడి తలపేమి లేకుండు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 33**

**భావము :–** అద్వైతాది మహా మునులు శరీరములో ఉన్నది నేను ఒక్కడినేనని చెప్పుకొనుచుండినప్పటికీ నీవు మాత్రము వేరుగాయుండి జీవుని కర్మనను సరించి శరీరమును కదలించుచూ జరిగెడి ఏ కర్మకు బాధ్యుడు కాని ఓ ఆత్మా! వినుము. శరీరములోని మనస్సుకున్న తన రెండు రకముల కార్యములను నిలిపివేయునట్లు చేసి, మూడు యోగములలో బ్రహ్మ యోగమును బాగా తెలిసినవాడై ఆచరించి, దాని ప్రకారము శరీరమును

మరచిపోయినపుడు తలలోని బుద్ధి మాత్రము పని చేయుచుండును. మనస్సు ద్వారా వచ్చు బయటి ఇంద్రియ విషయములు గానీ, లోపలి నుండి వచ్చు గుణపరంపరలుగానీ లేకపోవడము వలన అసలు శరీరమే పని చేయదు. పని చేయని దానివలన తన వలనే అన్ని పనులు జరుగుచున్నవనీ, తాను తానని బోధించు అహముకు పనిలేక అది అణిగి పోవును. అపుడు బుద్ధి కేవలము శరీరములోని ఆత్మను చూడగల్గుచున్నది. **శరీరము యొక్క ధ్యాస కలుగజేయు మనస్సు పని చేయుచుండిననూ, తాననెడి అహము పని చేయుచుండిననూ తలలోని బుద్ధికి ఆత్మ తెలియదు.**

***దారుణాది యోగము --- బ్రహ్మయోగము***

***మేరునందు చేరి --- శిరస్సులోని బ్రహ్మనాడిలో చేరి***

***తాను తాను యనెడి --- నేను నేననిపించు అహము***

***మూడు యోగములు --- బ్రహ్మయోగము, కర్మయోగము, భక్తియోగము***

***మనస్సుకు గల రెండు కార్యములు --- బయటి ఇంద్రియముల, లోపల గుణముల సమాచారమును బుద్ధికి చేర్చడము.***

***మేను మరచి --- శరీరమును ధ్యాసలో యుంచు మనస్సును అణచి***

**విశేషార్థము :-** శరీరములోని వెన్నుపాము అనెడి ముఖ్య నరములో ఏడు నాడీకేంద్రములు గలవు. తలనుండి క్రింద గుదస్థానము వరకు వ్యాపించి యున్న వెన్నెముక మధ్యగల వెన్నుపాములోని ఏడునాడీ కేంద్రములను ఆధ్యాత్మిక విద్యలో ఏడు పర్వతములుగా పోల్చిచెప్పారు. అన్నిటికంటే పైన తలలో గల నాడీకేంద్రమును మేరు శిఖరమన్నారు. అన్ని నాడీ కేంద్రములకంటే ఎత్తులోయుండుట వలన మరియు అన్నిటికంటే పెద్దనాడీ కేంద్రమైనదానివలన పర్వతములలో పెద్దదయిన ఎత్తయిన మేరు పర్వతముతో సమానముగా తలలోని మెదడును పోల్చి చెప్పడమైనది.

**ఆ ॥ అట్టి యోగి మరల నవని జనించడు**
**బట్టబయలు తనకు పట్టమాయె**
**కొలను విడిచి హంస గోతికి చేరునా**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 34**

**భావము :-** శరీరములో అణువణువునా వ్యాపించి, విధిని అనుసరించి శక్తినిచ్చు ఓ ఆత్మా! వినుము. మనసును అణచి బుద్ధి ద్వారా ఆత్మను తెలిసిన యోగికి జ్ఞానాగ్ని అనబడు శక్తి ఉద్భవించుచున్నది. భగవద్గీతలో చెప్పినట్లు కర్మలను కాల్చునది జ్ఞానాగ్ని. కావున బ్రహ్మయోగము ద్వారా లభించెడి అగ్ని యోగి శరీరములోని సంచిత కర్మను కాల్చుటకు మొదలుపెట్టును. బ్రహ్మయోగి పట్టు వదలకపోతే తన సంచిత కర్మనంతా కాల్చుకొని కర్మ శేషము లేకుండా చేసుకోగలడు. కర్మశేషము లేనివాడు అనుభవించవలసినది లేదు కనుక శరీరముతో పుట్టవలసిన పనే లేదు. అట్టివాడు జన్మలు మరణములు లేని పరమాత్మయందైక్యమగును. శరీరములో బ్రహ్మయోగము తెలిసి ఆత్మయొక్క అనుభవము బుద్ధికి తెలిసిన తర్వాత ప్రపంచములోని అన్ని ఆనందములకంటే అతీతమైన ఆనందము ఆత్మానందమని తెలియును. హంస కొలను విడచి గుంతకు చేరనట్లు, బ్రహ్మయోగి తన యోగమును వీడి ప్రపంచములో లగ్నము కావాలనుకోడు. ఆత్మానందము తెలిసినవానికి కర్మ ముగిసిన తర్వాత శరీరములోనున్న ఆత్మను కూడా వీడి శరీరము బయట బయలులోకూడానున్న పరమాత్మ లోనికి ఐక్యమగును.

**ఆ ॥ వేల్పు లెందుకు వేదంబులెందుకు**
**సాధనంబు లేని చదువులెల్ల**
**భేద మిడక మనసు బేజారియై యుండు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 35**

**భావము :-** శరీరములో బాహ్య ప్రపంచముతో సంబంధము పెట్టుకొని ఎల్లవేళలా పనిచేయుచున్న ఓ ఆత్మా! వినుము. మనిషి ఎంత జ్ఞానము తెలుసుకొనినా తెలిసిన దాని ప్రకారము నడువకపోతే ఏమి ప్రయోజనము లేదు. జ్ఞానము ప్రకారము ఆచరించని మనిషికి దేవతలెందుకు వేదములెందుకు? వేల్పులు వేదములు మనస్సుకు శాంతిని చేకూర్చలేవు. ఆచరణలేని జ్ఞానము కూడా మనోశాంతిని కల్గించలేదు. భగవంతుడు తెల్పిన జ్ఞానము ప్రకారము ఆచరించక వినేదానిని చెప్పేదానిని జ్ఞానమను కొంటే మనలోని మనస్సు రెండిటినీ విడువదు. ఒకటి ఖేదము రెండవది భేదము అని రెండు మనశరీరములో గలవు. ఖేదము అనగా సంతోషమును కలుగచేయుటకు కారణమైనవి. దాన, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమలు పుణ్యమును తెచ్చిపెట్టి దాని కారణమున సుఖములు సంతోషములు కల్గునట్లు చేయును. శరీరములో మంచి గుణము ఒకటుంటే దానికి విభిన్నముగా మరియొక గుణముండును. విభిన్నముగానుండు దానిని భేదము అంటాము. మంచికి చెడు భేదముగా ఉండును అలాగే చెడుకు మంచి భేదముగా ఉండును. ఒక దానికొకటి వ్యతిరిక్త దిశలో ఉండు దానిని భేదము అంటాము. ఆశకు భేదము దానము, కోపమునకు భేదము దయ. ఒకదానికొకటి భేదమయిన గుణముల యొక్క సంకల్పములు జ్ఞానమును ఆచరించని మనిషికి తగులుచునే ఉండును. వాని మనస్సు గుణముల ప్రభావమునకు లోనయి బేజారయి పోవుచుండును. అందువలన మనస్సు గుణములకు లొంగకుండా ఉండవలయునంటే, మనము నేర్చు కొన్న జ్ఞానమును అనుభవమునకు తెచ్చుకొన్నపుడు సుఖములకు పొంగక దుఃఖములకు కృంగక, విసుగు లేకుండా సమతుల్యముగా ఉండగలము. ఈ పద్యములో భేదము అన్న పదమును అన్ని గుణములకూ వర్తించు అర్థముతో చూడవలెను.

ఆ ॥ తోలుకొండ దీని తొమ్మిది వందల
గండుపులులు చుట్టు గాచి యుండు
కొండ శిఖరమందు కోమలి యొకతుండు
అఖిల జీవసంగ ఆత్మలింగ. 36

**భావము :-** శరీరములో ఏమాత్రము నిద్ర లేకుండా ఎల్లపుడూ మేల్కొని పనిచేయు ఓ ఆత్మా! వినుము. శరీరము వెడల్పు ఎత్తు కల్గి కాళ్లు పీటముగా, శిరస్సు శిఖరముగా ఉన్నది. మన శరీరము ఒక విధమైన కొండలాగా ఉన్నదని పోల్చి చెప్పవచ్చును. శరీరమంతా చర్మమను తిత్తిచే కప్పబడి ఉన్నది కావున దేహమును తోలుకొండ యని ఇక్కడ చెప్పారు. శరీరమునకు ఆరు జ్ఞానేంద్రియ రంధ్రములు మూడు కరేంద్రియముల రంధ్రములు గలవు. అందువలన వేదాంతులు కొందరు తోలుతిత్తియిది తూటులు తొమ్మిది తుస్సుమనుట ఖాయము అని శరీరమును గురించి అన్నారు. ఇక్కడేమో శరీరమును తోలుకొండ యని దానికున్న తొమ్మిది రంధ్రముల సమస్యలను తొమ్మిది వందల గండుపులులుగా వర్ణించి చెప్పారు. శరీరము కొండ కాగా దానికున్న రంధ్రములు వందల పులులుకాగా శరీరము యొక్క శిరస్సును కొండ శిఖరముగా వర్ణించి చెప్పారు. తలలోనే బ్రహ్మనాడి యొక్క ముఖ్య కేంద్రముండుట వలన ఆ కేంద్రమే ఆత్మ నివాస కేంద్రమైనందువలన ఆత్మను యువతిగా పోల్చి కొండశిఖరమందు కోమలి యొకతుండు అన్నారు.

ఆ ॥ కామరూపి దాని కామించి జనులెల్ల
కొండకొచ్చి పులుల కొరతబడిరి
ధీరుడైతె పులుల ద్రుంచి కొండెక్కును
అఖిల జీవసంగ ఆత్మలింగ. 37

**భావము :-** ఒక్కొక్క శరీరములో ఒక్కొక్క ఆత్మగా జీవాత్మకు తోడున్న ఓ

ఆత్మా! వినుము.  కొంత జ్ఞానదృష్టి కల్గినవారికంతయు శరీర శిఖరము నందు గల ఆత్మ కామరూపిగా తెలియును.  పూర్తి దృష్టిలేని వారికి ఏమీ తెలియకున్న, కొంత జ్ఞానమున్న వారందరూ తమ శరీరములోని ఆత్మను తెలియవలెనని అనుకొందురు.  పొందవలెనని అనిపించు ఆత్మను  కామ రూపి అన్నారు.  ఆత్మ పొందుకోరిన జనులను కామించిన జనులు అన్నారు. జీవాత్మ కోరుకున్న ఆత్మ శరీరశిఖరమున గలదు కావున శరీరములోనే ఆత్మను తెలియవలెనని అనుకొన్న వారందరు  శరీరములో శిరోశిఖరమున తమ ఆత్మను వెదకుటకు మొదలుపెట్టి జ్ఞాన కర్మేంద్రియముల రాక పోక విషయములకు చిక్కి ఆ విషయములందే చిక్కుకొని ఆత్మను తెలియలేక పోయారు.  ఇక్కడ ఇంద్రియ విషయములను పులులుగా పోల్చి కామించిన జనులెల్లా కొండకొచ్చి పులుల కొరతబడిరి అన్నారు.  విషయేంద్రియములను జయించి శిరస్సునందు మనోదృష్టిని నిల్పినవాడు  ఆత్మను తెలియును. కనుక అటువంటి వానిని  గూర్చి ధీరుడైతే  పులులద్రుంచి కొండెక్కును అన్నారు.

ఆ ॥ **జంటనాగ స్వరము జాడ తెలిసూదితె**
**పుట్టలో యున్న భుజగమపుడు**
**పట్టుబడును మంచి  పరమ యోగైతేను**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **38**

**భావము :-** శరీరాంతర్గతమై బాహ్యదృష్టికి కనిపించక జీవాత్మలైన  స్వాములు మునులు కూడా నేనే ఆత్మనని తలపోయినట్లు చేసి, నీవు మాత్రము వేరుగానున్న ఓ ఆత్మా! వినుము.  శరీరమనునది తొమ్మిది రంధ్రములు గల పుట్టతో సమానము.  శరీర పుట్టలో నాగుపాములాంటి ఆత్మ నివాసము చేయుచున్నది.  పుట్టలోని పాము బుసకొట్టినట్లు శరీరములోని ఆత్మ ఉఛ్వాస నిస్వాస అను శ్వాసల ద్వారా బుసకొట్టుచున్నది.  పాము యొక్క శబ్దమును

నాగస్వరము అన్నాము. నాగస్వరము ఉఛ్వాస నిస్వాసములందు ప్రత్యేక శబ్దము కల్గి ఉన్నది. ఆ శబ్దములనే 'సోహం' అని అంటున్నాము. సోహం శబ్దమునకు కారణమేమిటని ఆ శబ్దము బయలుదేరు జాడను తెలిసితే చివరకు ఆ శబ్దము చేయు పాము అనబడు ఆత్మ తెలియును. ఈ పద్య మందు పామును ఆత్మ అనియు, రెండు ముక్కు రంధ్రములలోని శ్వాసలు జంటనాగస్వరములనియు, ముక్కు రంధ్రముల శ్వాస నుండి బ్రహ్మనాడిలోని ఆత్మ వరకు ఆత్మశక్తి ఎలా ప్రవహిస్తున్నదో తెలియడము స్వరము జాడ తెలియడమని, అలా శరీరాంతర్గత పరిశోధన చేసిన వానిని పరమయోగి యనీ చెప్పడము జరిగినది.

**ఆ ॥ ఘంటనాదము హృదయ గగనంబుపై మ్రోగు**
**గగనమున్న చోటు గానరాదు**
**పరమ గురుని కరుణ బడయని నరులకు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 39**

**భావము :-** జీవాత్మకు పరమాత్మకు మధ్యన గల ఓ ఆత్మా! వినుము. హృదయమనునది మనశరీరములో గలదు. హృదయమును శరీరములోని గుండెగా కొందరు చెప్పుకొన్నప్పటికీ అది వాస్తవము కాదు. శరీర మధ్యలో గల బ్రహ్మనాడియే హృదయమను పేరుతో గలదు. హృదయములో ఆత్మ గలదు. కొందరు జీవాత్మగలదని కూడా అనుకొనుచుందురు. జీవాత్మ ఎప్పటికీ హృదయములో ఉండదు. జీవాత్మ గుణచక్రములో ఉండును. ఆత్మ మాత్రము హృదయములో ఉండి శరీరమంతయూ వ్యాపించుచున్నది. హృదయము (బ్రహ్మనాడి)లో గల ఆత్మ తన చైతన్యమును నరముల ద్వారా ఊపిరితిత్తుల వరకూ వ్యాపింపచేసి వాటిని కదలించుచూ శ్వాస ఆడునట్లు చేయుచున్నది. శ్వాస హృదయగగనంబు నుండి వచ్చుచున్నది. గగనము

అనగా కనిపించని శూన్యమని అర్థము. హృదయములోగల ఆత్మ కనిపించని శూన్యముగానున్నది కనుక ఆత్మను హృదయగగనము అన్నారు. ఆత్మ చైతన్యము నుండి వచ్చు శ్వాస యొక్క సోహం శబ్దమును గంటానాధముగా వర్ణించారు. **శరీరములోని ఆత్మ జీవాత్మకు తెలియాలంటే కనిపించు గురువుకంటే వేరుగనున్న పరమ గురుని కరుణ లేనిది సాధ్యము కాదు. జీవాత్మకు ఆత్మ తెలియాలంటే పరమాత్మ కరుణ అవసరము.** గుణ చక్రము లోని జీవునికి హృదయాంతరాళములో నుండి శరీరమంతా వ్యాపించిన ఆత్మ తెలియాలంటే శరీరము లోపల శరీరము బయట వ్యాపించి యున్న పరమాత్మ కరుణ అవసరమని మన పెద్దలు నొక్కివక్కాణించారు.

**ఆ ॥ చెవులు మూసుకొన్న చతురతలవి గావు**
**మాంస పిండ తనువు మరిచినట్లు**
**ప్రణవ మంత్ర సిద్ధి ప్రాప్తిని గనవలె**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 40**

**భావము :-** చెట్టులో తేమ వ్యాపించినట్లు శరీరములో శక్తిగా వ్యాపించి యున్న ఓ ఆత్మా! వినుము. ప్రస్తుత కాలములో దైవ జ్ఞానమును బోధించు బోధకులెందరో వచ్చారు. అటువంటివారు తమకు తెలిసిన పద్ధతిని వారి శిష్యులకు బోధించుచున్నారు. అలా మంచి మార్గమును బోధించడములో తప్పులేదు. కానీ తాము బోధించు విధానములో ఏదయినా లోపముందో లేదో యని ముందే యోచించక, తాము చెప్పునది బ్రహ్మవిద్యాశాస్త్రమైన భగవద్గీతకు విభిన్నముగానున్నదేమో ఆలోచించక, తమకు తోచింది చెప్పుచూ పోతే ఒకవేళ తాము చెప్పునది ధర్మవిరుద్ధమైతే మంచికంటే కీడే ఎక్కువ జరుగును. ఉదాహరణకు మనస్సును ఏకాంత పరచుకొమ్మని ఉందనుకొండి దానిని యోగమంటాము అని వివరించుటలో తప్పులేదు. ఆ వివరమును చెప్పుచూ ప్రపంచములోని అన్ని విషయములను విడచిపెట్టి

వాటిని మనస్సుకు చేరనీయవద్దని, ప్రపంచ విషయములు మనస్సుకు చేరకుండుటకు మనస్సు యొక్క ధ్యాసను శ్వాసమీద పెట్టమనో, లేక "ఓం నమః శివాయ" అను పంచాక్షరి మంత్రము మీద పెట్టమనో, లేక "సోహం" అను మంత్రము శ్వాసకు చేర్చి చూడమనో, ఏదో ఒక పనిని పెట్టి అదియే గురోపదేశమని అటువంటి సాధన చేయడమే యోగమని చెప్పడము పెద్ద తప్పగును. వినేవానికి మార్గభ్రష్టత చెప్పేవానికి బ్రహ్మవిద్యా పాపము లభించును. అందువలన బోధకులందరూ కడు జాగ్రత్తగా బోధించ వలసి యున్నది.

ఈ పద్యములో కూడా తప్పుగా అర్థము చేసుకొని పొరబడుటకు అవకాశము గలదు. ఏ బోధకుడూ అటువంటి పొరపాట్లు పడకుండుటకు ఒక సూత్రము గలదు. అనేకము అనగా ఎన్నో ఎక్కువ సంఖ్య అనియు లేక ఒకటికంటే ఎక్కువ అనియు చెప్పవచ్చును. ఏకము అనగా ఒకటి అని చెప్పవచ్చును. ఏకాంతము అనగా ఒకటి కూడాలేనిది శూన్యము అని చెప్పవచ్చును. దానినే ఏకాగ్రత అని కూడా చెప్పవచ్చును. ఏకాగ్రత అనగా ఒకటి పైన అని అర్థము, ఒకటి క్రింద రెండు మూడు మొదలుకొని ఎన్నియైనా ఉండవచ్చును. ఒకటి పైన ఏమీ ఉండదు. ఒకటి పైన సున్న ఉండును అనగా ఏమీ లేదని అర్థము. ఒకటి క్రింద రెండు నుండి ఎన్నయినా ఉండవచ్చును. ఆధ్యాత్మిక విద్యలో మనస్సును ఏకాంతము చేసుకొమ్మని ఏకాగ్రత పరచుకొమ్మని చెప్పుచుందురు. మనస్సుకు ఏకాంతమన్నా ఏకాగ్రత అన్నా ఏ ఆలోచనలు, ఏ జ్ఞాపకాలు లేకుండా చేసుకొమ్మని అర్థముండగా కొందరు బోధకులు, స్వాములు ఏకాగ్రత అని చెప్పుచూ మనస్సుకు ఏదో ఒక మంత్రమునో లేక ధ్యాసనో తగిలించడము న్యాయము కాదు ధర్మము కాదు. అలా చెప్పువారు మేము పెద్ద గురువులమని తమను తాము గొప్పగా చెప్పుకొనినా, దేవుని దృష్టిలో మాత్రము అధర్మపరులు

గానే గుర్తించబడుదురు. వారు చెప్పు ఉపదేశము ద్వారా సాధకుని మనస్సు ఏకాగ్రత పొందక పోవడమేకాక ఏకమునకు గట్టిగా అతుక్కుపోవును. దాని ద్వారా భవిష్యత్తులో ఎప్పటికీ ఏకాగ్రత పొందు అవకాశమే లేకుండా పోవును. సాధారణ మనిషి ఎప్పటికయినా అసలైన జ్ఞానము తెలిసి మనస్సును ఏకాగ్రతపరుచుకొనుటకు అవకాశముండును, కానీ మంత్రోప దేశము పొందినవారికి మాత్రము ఏకాగ్రత పొందుటకు అవకాశమే ఉండదు.

సాధారణ మనిషి యొక్క మనస్సు శరీరములోని గుణముల వలన అనేక ఆలోచనలను పొందుచుండును. మనస్సు దినములో లేక ఒక గంటలో ఎన్ని ఆలోచనలు పొందినప్పటికీ సూత్రము ప్రకారము మనస్సుకు ఒక్క సమయములో ఒక్క ఆలోచన మాత్రముండును. ఒక ఆలోచన పోయిన తర్వాత మరియొక ఆలోచన వచ్చుచుండును. మనస్సు ఒక దాని తర్వాత ఒకటిని ఆలోచించుచుండును. ఏక సమయములో ఏక ఆలోచన చేయుచుండుట మనస్సుకు సహజ పని. ఒక్క సమయములో ఒక్క ఆలోచన కూడా చేయకుండా చేయడమే నిజమైన సాధన అనబడును. దానినే ఏకాగ్రత అని కూడా అందుము. మనస్సుకు అనేక విషయములు మారుచూ ఒక్క విషయము మీద స్థిరత్వము ఏర్పడకుండినపుడు దానిని సాధన ద్వారా ఏ విషయము మీద లేకుండా చేయవచ్చును. అలాకాక మనస్సు ఒక విషయము మీద బాగా లగ్నమగుటకు అలవాటు పడినపుడు దాని నుండి ఏకాగ్రత పరచడము అనగా దానిని కూడా లేకుండా చేయడము సాధ్యము కాని పనియగును. ఏ ఒక్క విషయము మీద స్థిరత్వము లేని మనస్సునే ఏకాగ్రత పరుచుటకు చాలా కష్టమయిన పనిగయుండగా సాధన ద్వారా గురూపదేశమని ఒక మంత్రమను విషయమును మనస్సుకు అంటించు కొనిన తర్వాత, దానిని విడిపించి మనస్సుకు ఏమీ లేకుండా

చేయడము కష్టమైన పని అగును. అందువలననే భగవద్గీతలో ఇంద్రియార్థ విషయముల మీద మనస్సును లగ్నము చేయవద్దని దేవుడు చెప్పాడు. ఇంద్రియార్థ విషయములనగా ఐదు జ్ఞానేంద్రియములకు సంబంధించిన విషయములని అర్థము. గురువు ద్వారా ఉపదేశము మంత్ర రూపముతో చెప్పించుకొన్నపుడు అది చెవి అను ఇంద్రియము ద్వారా వచ్చు విషయమగును కావున ఆ గురూపదేశవిషయము కూడా దేవునికి సంబంధములేని ఇంద్రియార్థ విషయమగును. ఏ ఒక్క ఇంద్రియ విషయము లేనిదే నిజమైన యోగమగును.

ఆ విషయమును తెల్పునదే పై పద్యము. ఈ పద్యములో చెవులు మూసుకొన్న చతురతలవి గావు అన్నారు. తాత్కాలితముగా చెవులు మూసుకొన్ననూ ప్రయోజనము లేదని అది జ్ఞానసాధన కాదని తెలిపారు. చెవులను మూసుకొని అంతకుముందు వినిన విషయమును జ్ఞాపకము చేసుకొనుటను ఈ పద్యములో ఖండించారు. మూడుగుణములను వదలి నాల్గవదైన యోగమును పొందడమును చతురత అంటారు. చెవులు మూసుకొన్న చతురత కాదనడము అది యోగ పద్ధతి కాదని తెల్పడమేనని అర్థము చేసుకోండి. ఐదు ఇంద్రియముల విషయములను మరువడమును సూచిస్తూ "మాంసపిండ తనువును మరచినట్లు" అన్నారు. శరీరమును మరవడము అనగా ఇంద్రియ ధ్యాసలన్నీ మరవడమని అర్థము. శ్వాస మీద ధ్యాసగానీ, ముక్కు మీద ధ్యాసగానీ లేక మంత్రము మీద ధ్యాసగానీ ఇంద్రియ ధ్యాసలే అగును. శ్వాస ధ్యాస చర్మమునకు సంబంధించిన స్పర్శ అగును. అలాగే మంత్రము ధ్యాస చెవితో విన్న వినికిడి విషయమగును కావున ఈ ధ్యాసల వలన శరీరమును మరచినట్లు కాదు. ప్రణవ మంత్రము మన శ్వాసలోనే ఉన్నదని ప్రణవ మంత్రమైన "ఓం" సో చివరిలో "ఓ" గాను, హం చివరిలో "మ్" గాను ఇమిడి ఉన్నదని

తెలుసుకొన్నాము. ప్రణవ మంత్రసిద్ధి అనగా ఓంకారము కూడుకొన్న ఉఛ్వాస నిస్వాసలు పుట్టుచోటు అని అర్థము. సిద్ధి అనగా లభించునదనీ ప్రణవ మంత్ర సిద్ధి అనగా ఓంకారమును పుట్టించు ఆత్మ అనీ తెలియవలెను. ప్రణవ మంత్రసిద్ధి ప్రాప్తిగనవలెననగా ప్రణవ మంత్రమైన ఓం కారమును పుట్టించు ఆత్మను పొందవలెనని అర్థము. శరీరములో అన్నిటికీ శక్తి నిచ్చు ఆత్మవలననే ఊపిరితిత్తులు కదలి శ్వాస ఏర్పడి, సోహం శబ్దముగా తయారై, అందులో 'ఓం' తయారగుచున్నది. ఓం ను పుట్టించు ఆత్మను పొందవలెనంటే చెవులు, కన్నులు మూసుకొంటే జ్ఞానము కాదనీ శరీరములోని ఐదు జ్ఞానేంద్రియములను మరచి లోపలనున్న ఆత్మను తెలియవలెనని పై పద్యములో చెప్పారు. అందువలన ఇప్పటికయినా శరీరము మీద మంత్రము మీద ధ్యాసలు వదలి ప్రణవమునకే కారణమైన ఆత్మను శరీరమును మరచి తెలియవలెను.

**ఆ ॥ నల్ల తామరాకు నడుమ రంధ్రములోను**
**కుండలి యను పాము గ్రుడ్డు పెట్టి**
**రెండు పిల్లలీని రేయిబగలరచెన్**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 41**

**భావము :-** ఇనుముతో కలసిన అగ్నికి కూడా కొలిమి దగ్గర సమ్మెట దెబ్బలు తప్పవన్నట్లు జీవునితో చేరి శరీరమంతా వ్యాపించి అప్పుడప్పుడు ఆకలికి శక్తిహీనత చెందుచున్న ఓ ఆత్మా! వినుము. నీటి ఉపరితలము మీద తామరాకు కనిపించునట్లు, మనిషి శరీరము యొక్క ఉపరితలము మీద తల భాగమున వెంట్రుకలు కప్పబడి నల్లగా కనిపించుట వలన తల పై భాగమును పై పద్యమందు **'నల్లతామరాకు'** అన్నారు. కొందరు ముసలివాళ్లకు తెల్ల వెంట్రుకలుండును కదా!యని అడుగవచ్చును. అటువంటి వారి తలలను తెల్ల తామరాకు అనవచ్చును. ఎక్కువ శాతము

నల్ల తలలుండుట వలన నల్లతామరాకు అని చెప్పారు. ప్రతి ఒక్కరికి తల మధ్య భాగములో బ్రహ్మనాడి ఉండును. బ్రహ్మనాడి యొక్క స్థానము **'పునక'** అని చిన్న పిల్లలపుడు అంటుంటాము. తల మధ్య భాగములో ఎముకల మధ్యన ఒక రంధ్రముండుట శిశుదశలో అందరికీ కనిపించుట సహజమే. దానినే "నల్లతామరాకు నడుమ రంధ్రము" అన్నారు. తల మధ్యభాగమున గల బ్రహ్మనాడిలో ఆత్మ నివాసమై యుండి శరీరమునకు చైతన్యమునిచ్చుచున్నది. అంతేకాక జీవుడు శరీరములో చేరినప్పటినుండి శరీరమును వదలిపోవు వరకు శ్వాసను కదలించుచున్నది. బ్రహ్మనాడిలోని ఆత్మను కుండలి అని పేరు పెట్టి పాముగా పోల్చారు. కుండలి అనగా పెద్దల యొక్క భావములో శక్తి అని అర్థము. శక్తిని పాముగా చెప్పడములో ఒక అర్థము కలదు. అదేమనగా! శరీరములోని శక్తి ఒకప్పుడు ఎక్కువ ఒకప్పుడు తక్కువ ఉపయోగపడుచున్నది. ఉదాహరణకు పదిమైళ్లు నడిచేవాడు ఒక సమయములో ఒకమైలు కూడా నడువలేడు అలాగే ఒకమైలు కూడా నడువలేని వాడు ఒక సమయములో అవలీలగా పదిమైళ్లు నడువగలడు. ఈ విధముగా శరీరములోని ఆత్మశక్తి పొడవు పొట్టిగా ఉపయోగపడుచున్నది కావున చుట్టచేసుకొన్నపుడు చిన్నగా, ప్రాకునపుడు పొడవుగా కనిపించు పాముతో పోల్చి చెప్పారు. ఒకప్పుడు చిన్నగా ఒకప్పుడు పెద్దగా కనిపించు పామును ఆ విధముగనే ఉపయోగపడు ఆత్మతో పోల్చి కుండలియను పాము అన్నారు. తల మధ్య భాగము నుండి ప్రారంభమగు బ్రహ్మనాడిలో ఆత్మ నివాసమున్నది. కావున **"నల్లతామరాకు నడుమ రంధ్రములోను కుండలి అను పాము"** అన్నారు. బ్రహ్మనాడిలోని ఆత్మ తన శక్తి ద్వారా రెండుముక్కు రంధ్రములలో శ్వాసను రెండు ఊపిరితిత్తుల ద్వారా నడిపించుచున్నది. ఆ విషయమునే పరోక్షముగా చెప్పుచూ బ్రహ్మనాడి నుండి ఊపిరితిత్తులకు వచ్చునాడిని గ్రుడ్డుగా వర్ణించి, రెండు

ఊపిరితిత్తులను రెండు పిల్లలుగా వర్ణించి, ఇరువది నాల్గుగంటలు ఎల్లపుడూ ఆడు శ్వాస శబ్దమును పిల్లల అరుపుగా వర్ణించి **"గ్రుడ్డు పెట్టి రెండు పిల్లలీని రేయిపగలరచెన్"** అన్నారు.

**ఆ ॥** **అట్టిరోధంబు యఖిల వేదాంతంబు**
**సకల మునుల సురుల సన్నుతంబు**
**నిరతమైన యోగ నిష్ఠయనంబడు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 42**

**భావము :-** శరీరములో బ్రహ్మనాడిని కేంద్రముగా చేసుకొని శరీరమంతా వ్యాపించియున్న ఓ ఆత్మా! వినుము. బ్రహ్మనాడిలో ప్రారంభమగు కదలిక చివరకు శ్వాసరూపముగా బయటపడుచున్నది. శ్వాస శబ్దముతో కూడు కొన్నది కావున దానిని **"రెండు పిల్లల అరుపు"** అన్నారు. రెండు శ్వాసలు చేయు శబ్దములో విశేషార్థము ఇమిడియున్నది. సకల వేదవంతమయిన "ఓం" అందులో ఇమిడి యుండుట వలన ఆ శబ్దము **"సకల సురుల మునుల సన్నుతంబు"** అన్నారు. ఓం శబ్దము వచ్చు మూలమును తెలియుటయే అసలయిన బ్రహ్మయోగమగును. సకల వేదాంతంబు మరియు సురులు, మునులు సమ్మతింపదగిన ఓం కారమూలము శరీరము లోని మధ్యనాడిలో గలదని తెలిసి, మనోదృష్ఠిని మధ్యనాడిలో చేర్చి శరీరములో కదలికకు కారణమైన శక్తిని వెదకుటయే ముఖ్య యోగ నిష్టయగును.

**ఆ ॥** **సాంఖ్యయోగ మెరిగి సకలేంద్రియంబులు**
**సంచరించుచున్న సంజ్ఞగాంచి**
**పంచి యెంచి పైన పరమాత్మ గనవలె**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 43**

**భావము :-** జీవాత్మకు పెద్దవాడు పరమాత్మకు చిన్నవాడయిన ఓ ఆత్మా! వినుము. మనము నివశించు శరీరము ఎన్ని భాగములుగానున్నదని తెలియడమును సాంఖ్యమంటాము. శరీరములో జీవుని మినహా మొత్తము 24 భాగములున్నవని తెలియడము సాంఖ్యము. శరీరములో జీవునితో సహా అన్ని భాగములు ఎలా పనిచేయుచున్నవో, అన్ని అవయవములు కదలుటకు ఏ శక్తి అవసరమో తెలిసి, అన్నిటికీ చైతన్యమైనది ఆత్మయేనని, ఆత్మ కదలిక చేతనే శరీరము సజీవమైనదనీ, అది లేకపోతే శరీరములో జీవుడు కూడా ఉండుటకు వీలులేదనీ, శరీరములోని అన్నిటికి కారణమైనది ఆత్మనీ దానిపైన గలది పరమాత్మయనీ తెలియవలెను. శరీరమును సాంఖ్య సూత్రము ప్రకారము విడదీసి చూచి 24 ఇంద్రియములు గలవని, వాటిపైన జీవాత్మ గలదని దానిపైన ఆత్మగలదని అన్నికంటే మించి ఆత్మ మీద పరమాత్మ గలదని తెలియవలెను.

**ఆ ॥ పంచతత్త్వములను పంచీకరించక**
**మంచియతుల మన్న మాటలన్న**
**కుంచమందు గజము గ్రుడ్డు పెట్టిన విధంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 44**

**భావము :-** సమస్త శరీరములలో నాశనమగు జీవాత్మతో కలసి నివాసము చేయుచున్న నాశనము కానీ ఓ ఆత్మా! వినుము. పంచభూతములైన ఆకాశము గాలి, అగ్ని, నీరు, భూమి ఎట్లు సృష్ఠింపబడినవీ, అవి ఒక్కొక్కటి ఏ విధముగా ఐదు భాగములు విభజింపబడినది. అలా విభజింపబడిన 25 భాగములు ఒకదానితో మరొకటి కలసి ఎలా శరీర భాగములు ఏర్పడినది తెలియడమే సాంఖ్యము అంటాము. పంచతత్త్వములను పంచీకరించి సాంఖ్యమును తెలియనివారు మరియు శరీరములోని ఆత్మ తనశక్తి చేత శరీర భాగములను ఎలా పని చేయించుచున్నది తెలియకనే

మేము జ్ఞానులమనీ అనుకొంటే, గంపక్రింద ఏనుగు గ్రుడ్డు పెట్టినట్లుండు నంట. ఏనుగును గొలుసులుతో బంధించి గంపక్రింద నిలబెట్టినప్పటికీ అది గ్రుడ్డుపెట్టదు. దీనిని బట్టి చూస్తే ఏనుగు గంప క్రింద గ్రుడ్డు పెట్టడము ఎంత అబద్ధమో అలాగే శరీర అవయవముల వివరము తెలియనివాడు జ్ఞాని అనుట కూడా అంతే అబద్ధమగును.

**ఆ ॥ మాకు తెలిసినంత మర్మంబు ధరలోను**
**మరియు లేదటంచు మనుజులెల్ల**
**నొకరితోను ఒకరు వాదించుచున్నారు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 45**

**భావము :-** శరీరమందు మాత్రము శక్తిగా యున్న ఓ రెండవ ఆత్మా! వినుము. ప్రస్తుత కాలములో మనుషులు దేవుని విషయములో కొన్ని వర్గములుగా చీలిపోయి మా వర్గమునకే దేవుడు, దేవుని విషయములు తెలియునని, మిగతా ఎవరికి దేవుడు, దేవుని విషయములు తెలియవని పల్కుచున్నారు. ఒక వర్గముతో మరియొక వర్గమువారు ఈ విధముగా వాదించుచూ దేవుడు మాకు మాత్రమే తెలుసు అంటున్నారు. ఒకరి విధానమును ఒకరు ఒప్పుకోక పూర్తి విభేదించుట వలన చివరకు ఘర్షణలు పెద్ద యుద్ధములు ఏర్పడుచున్నవి. దేవుని విషయములో వర్గములుగా చీలిపోయిన మనుషులు వారి వారి వర్గములకు మతముల పేర్లు పెట్టుకొని మతముల మాయలో పడిపోయి దేవుని వాస్తవికతను తెలియలేక ఒక మతముతో మరియొక మతము వారు వాదించుకొనుచున్నారు.

**ఆ ॥ తెలిసినామటంచు తేటగా బల్కిరి**
**ఏమి తెలిసినారో ఎందుకొరకో**
**తర్క వాదమునకో ధరకీర్తి కోసమో**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 46**

**భావము :-** శరీరములో కర్మానుసారము కదలికలిచ్చుచూ, కర్మానుసారము రోగములు కలుగజేయుచూ వాటిని అనుభవింపజేయు ఓ అత్మా! వినుము. భూమి మీద ప్రజలలో దేవుడు, దేవుని విషయములో మాది సరియైన మార్గమని కొందరు, మీది కాదు మాదే సరియైన మార్గమని మరి కొందరు వాధించుకొనుట జరుగుచున్నది. ఇదంతయు చూస్తే వీరికి దేవుని విషయము కొంతయిన తెలుసునా? అని అనుమానము రాక తప్పదు. దేవుని జ్ఞానము తెలిసినవారయితే అలా వాదించుకొనరు. ఇతరుల మాటలలోని సత్యమును గ్రహింతురు. ఎదుటి వ్యక్తి మాటలలోని సత్యమును గ్రహించనివారు అర్థములేని, శాస్త్రబద్దత లేని వాదము చేయుచునే ఉందురు. అటువంటి వారు భూమిమీద తమ గొప్పతనమును చాటుకొనుటకే ప్రయత్నించు చుందురు గానీ సత్యమును గ్రహించలేరు. ఇతరుల మాటలలోని ఎంతటి గొప్ప సత్యమునయినా గ్రహించలేని స్థితిలో తాము గొప్పవారమని తమ మత గ్రంథములే గొప్పవనీ గోడ కట్టుకొని కూర్చొని ఉందురు. అటువంటి వారికి ఎదుటివారు ఏమి చెప్పినా ఆ గోడదాటి వారికి వినిపించదు కనిపించదు.

**ఆ ॥ తనదు నెత్తిమీద దన్నెడు కర్మంబు**
**వెడలుటకు గురుని వెదకి వెదకి**
**పూజ చేయ ముక్తి పొందుట కొరకయా**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 47**

**భావము :-** శరీరములోని మూడు ఆత్మలలో మధ్య ఆత్మయై శరీరమును నడిపించు శక్తికల్గియున్న ఓ ఆత్మా! వినుము. మనము గత జన్మలలో సంపాదించుకొన్న ఆగామి కర్మ సంచితకర్మయై తలలో నిలువయుండి, అందులో నుండి ప్రారబ్ధకర్మమను పేరుతో ఈ జన్మలో అనుభవానికి వచ్చి దాని ప్రకారము అనుభవింపజేయుచుండును. కర్మను లేకుండా చేసు

కోవలయునంటే లేక దాని అనుభవమును పొందకుండా ఉండలవయు నంటే తప్పనిసరిగా గురువు అవసరము. జన్మలనుండి తప్పించి ముక్తి కలుగజేయువాడు గురువు. అటువంటి గురువు కొరకు వెదక వలసియుండును. వెదక వలసిన పనేముంది గురువులే మన ఇంటివద్దకు వచ్చి ఉపదేశమిచ్చి పోవుదురు కదా! అని కొందరనుకోవచ్చును. ఇక్కడ చాలామందికి తెలియని పొరపాటొకటి కలదు. అది ఏమనగా! గురువును భూమి మీద గుర్తించుట చాలా అరుదైన పని. గురువువలె కనిపించు బోధకులను చాలామందిని మనము చూడగలము. వీరిలో గురువెవరు? బోధకుడెవరు? అని గుర్తించుట కష్టమైన పనియే. అందువలన గురువు అనగా అర్థమేమిటో తెలుసుకొని గురువును వెదకవలసి ఉంటుంది. పరమాత్మ అంశతో పుట్టినవాడే గురువు. ఆయన స్వయముగా జ్ఞానమును బోధించగలడు. గురువు తానెప్పుడు ఇతరులు చెప్పిన బోధలు చెప్పడు. ఇతరులు చెప్పిన వాటిని చెప్పువాడు బోధకుడగును. తాను స్వయముగా నిర్ణయించిన జ్ఞానమును తెలియజేయువాడు గురువగును. అటువంటి వాడు అరుదుగా దొరుకును కనుక గురువు అనువాని కొరకు వెదక వలసి యుండును. కొన్ని మతములలో గురువు అవసరము లేదు అతనిని పూజించుట కూడా మంచిది కాదు. నీ భక్తి నేరుగా దేవుని మీదనే ఉండవలెనను వాదన కలదు. వారి వాదనలో సత్యమున్నప్పటికీ ఆ దేవుడే మనిషి రూపములో వచ్చుననుట వారికి తెలియదు. సాధారణ మనుషులను గానీ, బోధకులను గానీ మ్రొక్కడము మంచిది కాదని మేము కూడా అనగలము కానీ, అరుదుగా దేవుడే మనిషైనపుడు ఆ మనిషిని గురువుగా గుర్తించి మ్రొక్కడములో తప్పు లేదు. దేవుడు సర్వశక్తిమయుడు కావున మన తల మీద గల కర్మను తీసివేసి ముక్తిని కలుగజేయు శక్తి అతనికుండును. అందువలననే ఈ పద్యములో **"గురుని వెదకి వెదకి పూజచేయ ముక్తి పొందుటకయా"** అన్నారు. గురువులయినవారు అంత

సులభముగా గుర్తింపబడరు. గుర్తింపబడినా సులభముగా మ్రొక్కించుకొనరు. దగ్గర చేరిన వారికి జ్ఞానమును ఎక్కించకమానరు. తమజ్ఞానము వలన కర్మను లేకుండా చేయక మానరు.

**ఆ ॥ అందుకొరకు గాని ఆత్మజ్ఞానంబు**
**ఆట గాదు బొమ్మలాట గాదు**
**వాట మెరిగి మాయ మాతను దాటుము**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 48**

**భావము :-** శరీరములో ఎవరూ గుర్తించలేని విధముగా శరీర ఆకృతిని పోలియుండు ఓ ఆత్మా! వినుము. కొందరు గురువు అంటే నీచవృత్తి పరునిగా, జ్ఞానమును తెలిసిన వారిని బుద్ధిహీనులుగా పోల్చుకొని ఏహ్య భావము కల్గియుందురు. ప్రపంచ విషయములలో మునిగి ధనార్జన తప్ప ఏదీ గొప్పపని కాదని తలపోసి, చివరి దశలో తాను సంపాదించినదంతా ఒదులుకోలేక, తమ స్థితి తమకే అర్థముకాక, అగమ్య గోచర పరిస్థితిలో చనిపోవు వారికంటే, జీవితానికి ఒక ధ్యేయము కల్గి, దేవుడే తమకు గమ్యమని తెలిసి ఒక ఉద్దేశముతో చనిపోవువారు గొప్పకదా! మనకు తెలియకుండా ప్రపంచములో అనేక అగచాట్లు కలుగజేయు మాయ ఏమిటో తెలిసి, దాని పర్యవసాన రూపములే గుణములనీ, కార్యములనీ, సుఖ దుఃఖములని గ్రహించి వాటిని వదలి దైవమును చేరుటే జ్ఞానోపాసన. అది కొందరనుకొన్నట్లు ఆటగాదు బొమ్మలాటగాదు ఎంతో తెలివితో కూడుకొన్న పని. సర్వ జనులను మూడు సూత్రములతో ఆడించు మాయను తెలిసి దాని చేతికి చిక్కకుండడమే జ్ఞానోపాసన. ఈ పని సాధించుటకు జగతిలోని ఇంజనీర్ల తెలివికంటే, డాక్టర్ల తెలివికంటే, విజ్ఞాన పరిశోధకుల తెలివికంటే అధిక తెలివి అవసరము. ఎంతో గొప్ప పరిజ్ఞానముతో కూడుకొన్న దైవాన్వేషణ మార్గమును తెలివి తక్కువ పనిగా తలచు

వారికి ఎంత తెలివి వుంటుందో వారు ఏ కోవకు చెందినవారో మీరే ఆలోచించండి.

**ఆ ॥ అంతరాత్మనెరిగి ఆనందమొందక**
**భ్రాంతి దయ్యములచే పట్టుబడిన**
**చింతతీరదయ్య చీకాకు విడదయ్య**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 49**

**భావము :-** శరీరములోని బ్రహ్మనాడిని స్థావరముగా ఏర్పరుచుకొని శరీరమంతటా నఖ శిఖ పర్యంతము వ్యాపించి శరీరాకృతిని పోలియున్న ఓ ఆత్మా! వినుము. మనిషి నేను దైవజ్ఞాన విషయములలోనున్నానని పొరపడి, మతముల భ్రమలోనో, దేవతల భ్రమలోనో మునిగి, నా దేవుడు గొప్పయనో నా మతము గొప్పయనో, నా మార్గము గొప్పయనో వాదించు కొనుచుండిన ప్రయోజనము లేదు. జీవాత్మ అయినవాడు తనలోని ఆత్మ విషయమును తెలియనిది, ఆత్మను తెలిసి దాని ఆనందమేమో తెలియనిది లోపల గుణముల చింతలు తీరవు. గుణముల చింతలు తీరనిది చీకాకులు బాధలు వీడవు. అందువలన ఏ మతస్థుడయినా కాని కొంత ఆలోచించవలసి యున్నది. దేవుడు సర్వవ్యాప్తి అయినపుడు మన శరీరములో కూడా ఉన్నాడని, శరీరములోనే దేవున్ని తెలియవలసి ఉన్నదని, శరీరములోని దేవున్ని తెలియాలంటే దేవునికి నీకు మధ్యగల ఆత్మను తెలియవలసి ఉన్నదనీ, ఆత్మను తెలియాలంటే శరీరములోని స్థితిగతులు తెలియవలెననీ, శరీరము లోని స్థితి గతులను తెలియనిది 'మాయ' అను దయ్యము వదలదనీ, మాయ అను దయ్యము సర్వోన్నతుడయిన దేవున్ని తెలియనియ్యదనీ, మాయ వివరము తెలిసి, దానిని వదలించుకొన్నపుడే మొదట ఆత్మ, ఆ తర్వాత దైవమయిన పరమాత్మ తెలియగలడనీ గ్రహించవలెను.

**ఆ ॥ బాహ్యదృష్టి విడచి బైలందు లక్షించి**
**లక్ష్యమందు మూడు లక్షణములు**
**తెలిసినట్టి వాడు  దేవుడనంబడు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 50**

**భావము :-** శరీరములోపల జరుగు సమస్త కార్యములకు సాక్షియైయున్న ఓ ఆత్మా! వినుము.  బయట మాటల రూపములో వాదించుట మాని శరీరములోని దేవున్ని కనుగొనాలంటే శరీరములోని స్థితిగతులు తెలుసు కోవాలన్నాము కదా! ఆవిధముగా శరీరములోని అంతరేంద్రియముల విషయము తెలిసినవాడు అంతరేంద్రియములలోని ముఖ్యమైన  మనస్సుకు బాహ్యాచింతలు చేరనీక, మనోదృష్టిని ఏ విషయము మీదికి కేంద్రీకరించక ఏక అంతమయిన శూన్యములోనికి, ఏక అగ్రమయిన సున్నలోనికి, ఏమీకాని ఏదీకాని ఖాళీలోనికి లగ్నము చేసి చూచితే చివరకు సాధ్యపడునది ఆత్మ. మనోదృష్టికి లక్ష్యపడు లేక తెలియపడు ఆత్మను పూర్తిగా పరిశీలించితే ఒకే ఆత్మ ముందు జీవాత్మ వెనుక పరమాత్మ కలదని తెలియుచున్నది. శరీరములోని మనోదృష్టిని బాహ్యమందు కాక లోపల పెట్టితే తెలియబడు ఆత్మ వలన ఆత్మ మూడు విధములుగానున్నదని తెలియుచున్నది.  అదియే భగవద్గీతలో  చెప్పబడిన **ఒకటి క్షరుడు, రెండు అక్షరుడు, మూడు పురుశోత్తముడని** తెలియవలెను.  అక్షరుడయిన ఆత్మను తెలియుట వలన దానికంటే కొంత భేదము కల్గిన క్షరుడయిన జీవాత్మ యొక్క విషయము తెలియబడును.  అలాగే అక్షరుడయిన ఆత్మకంటే ఎంతో భేదము కల్గిన పరమాత్మ గొప్పతనము తెలియబడును.  మనోనిగ్రహత వలన కల్గు బ్రహ్మయోగము అనబడు సాధన వలన ఆత్మను తెలిసినవాడై, ఆత్మకంటే వేరుగా తానయిన జీవాత్మనున్నాననీ గ్రహించి, జీవాత్మ ఆత్మలకంటే వేరుగా నున్న అన్నిటికంటే పెద్దదయిన పరమాత్మను తెలియువాడు ముక్తి పొంది

దేవుని లోనికి కలసి పోవును. అట్లు ఐక్యమైన వానిని దేవుడని చెప్పవలసి ఉన్నది. ఐక్యమైనవాడు శరీరమును వదలి తిరిగి పుట్టక శూన్యముగా మారిపోయాడు గనుక వానిని దేవుడనియే చెప్పవలెను. శరీరములోనున్న మనము శరీరము లేకుండా ఆకారముగానీ, పేరుగానీ లేని దేవునిలోనికి కలిసిపోవాలంటే దైవము మూడు ఆత్మలుగనున్నదనీ అవి కలిస్తే ఒకే పరమాత్మగా మారగలదని తెలియాలి.

**ఆ ॥ విషయ గుణములెల్ల విడువని నరులకు**
**విశద పడదు విమల మోక్షదృష్టి**
**విషయ గుణములందు విషమున్నదోయన్న**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 51**

**భావము :-** అకాల మరణము పొందిన వానికి శరీరము పోయినప్పటికీ అదే శరీరాకృతి కల్గి సూక్ష్మముగా కనిపించక వాని కర్మానుసారము ఆడించు ఓ ఆత్మా! వినుము. లోపలి అంతరాత్మ మీద దృష్టి నిలుపక బయటి విషయ గుణముల మీదనే లగ్నమగువారికి జ్ఞానము గానీ, దేవుడు గానీ, మోక్షమను నది గానీ ఏమాత్రము అర్థము కాదు. పరిశుద్ధమైన ఆత్మజ్ఞానము వారికి విలువలేనిదిగా కనిపించుచుండును. అపరిశుద్ధమైన కర్మలతో కూడుకొన్న ప్రపంచ విషయములు ఎంతో విలువున్నవిగా కనిపించును. కొందరు అజ్ఞానులకు విలువనిచ్చి వారితో సహవాసము పెంచుకోవడము, జ్ఞానులయిన వారికి విలువివ్వక, వారిని నీచముగా చూడడము కూడా ప్రపంచములో జరుగుచున్నది. అలా బయట ప్రపంచములోని విషయము లకు, తన దేహములోని గుణములకు విలువిచ్చినవాడు చివరకు వాటి వలన బాధ పడవలసివచ్చును. బాధకు ప్రతిరూపము విషము. విషము మనిషిని బాధించుటకే ఉన్నదనీ, విషము ఎప్పటికీ సంతోషము నివ్వదనీ, బాధించడమే దాని సహజ ధర్మమనీ పెద్దలు చెప్పుచుందురు. విషము

నుండి పుట్టిన పదమే విషయము, విషమునకు చాలా దగ్గర పోలికలున్న పదము విషయము. విషయము అనుపదములో "య" తీసివేస్తే విషము అగును. విషము మనిషిని బాధించి చంపగలదు. విష (య)ము మనిషిని చంపకుండా బాధిస్తునే ఉండును. విషమునకు విషయమునకు దగ్గర సంబంధముండి కొంత మాత్రము తేడా గలదు. విషము చంపగలదు విషయము చంపకుండా బాధించగలదు. అందువలన ఈ పద్యములో విషయములను దగ్గర పోలికగల విషముతో సమానముగా పోల్చి **"విషయ గుణములందు విషమున్నదోయన్న"** అన్నారు. కావున విమలమైన మోక్షము విశదపరుచుకోక విషమున్న విషయ గుణములలో పడువాడు జన్మ జన్మలకూ బాధపడవలసియుండును జాగ్రత్త!

**ఆ ॥** **విషయభ్రమలు గెలిచి విజ్ఞానమును దెలిసి**
**యసి పదార్థమెరిగి యాత్మ గలిసి**
**బసవుడైన వెనుక భయమేమి యున్నది**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **52**

**భావము :-** మరణముండి నాశనము లేని ఓ ఆత్మా! వినుము. ప్రపంచము లోని విషయములు, శరీరములోని గుణవివరములు గ్రహించి, వాటి వలన ముప్పు తప్ప మంచి జరుగదని తలచి, తెలియవలసినదేదో అర్థము చేసుకొని, దైవ జ్ఞానమును పూర్తిగా తెలిసినవాడై, దానివలన తనలోని ఆత్మను తెలిసి కర్మలను అంటక, ఏ విషయమునకు చలించక, బసవునివలె అన్నిటికీ సమానత్వము కల్గిన వానికి జన్మల కర్మల భయము లేకుండా పోవును. దేవున్ని తెలియుటకు ఆయనయందైక్యమగుటకు గల బ్రహ్మ, కర్మ యోగములనబడువాటిలో ఈ పద్యము బ్రహ్మయోగమును గూర్చి చెప్పినటువంటిదనీ తెలియవలెను.

**ఆ ॥ పంచరంగులున్న పాప మధ్యంబున**
**మంచి బ్రహ్మ కళయు మెరియుచుండు**
**గాంచి దానియందు కలసిన శివయోగి**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 53**

**భావము :-** ఆకాశముననున్న సూర్యుడొక్కడే ప్రపంచమంతటినీ తన వెలుగుచే ప్రకాశింపజేసినట్లు బ్రహ్మానాడియందుండి శరీరమంతటా చైతన్యముగా వ్యాపించియున్న ఓ ఆత్మా! వినుము. పంచ భూతములచే తయారయిన శరీరమునందు మధ్య భాగములో బ్రహ్మానాడి యున్నది. దానిలో చైతన్య ప్రకాశమైన ఆత్మ యున్నది. ఆత్మను తెలిసి దానియందు లగ్నమైనవాడే శివయోగి.

**విశేషార్థము :-** మన శరీరము ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి అను ఐదు భాగములచే తయారయినది. శరీరములో రంధ్రములు గల గొట్టములందు ఆకాశము, శ్వాస ద్వారా గాలి, వేడిమి ద్వారా అగ్ని, మూత్ర చెమటల ద్వారా నీరు, ఎముక కండల ద్వారా భూమియున్నట్లు ప్రత్యక్షముగా తెలియుచున్నది. అందువలన ఈ శరీరమును పంచరంగులున్న పాపయని చెప్పబడినది. శరీర మధ్యలో బ్రహ్మానాడి యందు ఆత్మ నివసించుచున్నది. అందువలన ఆత్మను **"పాప మధ్యంబున బ్రహ్మకళయని"** చెప్పియున్నారు. ఆత్మశక్తి చైతన్యము ద్వారా శరీరమంతటా వ్యాపించి యున్నది. అందువలన ఆత్మను దీపముగా పోల్చి శరీరమంతయూ వ్యాపించిన శక్తిని కాంతిగా పోల్చి మెరయుచుండు అన్నారు. ఆత్మను తెలుసుకొని దానియందే లగ్నమైన వారికి ఆత్మకు భేదముండదు. కావున **"దానియందు కలిసినవాడె శివయోగి"** అన్నారు.

**ఆ ॥ దినము నిర్వికల్ప నిష్ఠ సమాధిచే**
**తనదు పూర్వకర్మ దొలగిపోవు**
**గాని వేరు విధంబున గనరాదు మోక్షంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 54**

**భావము :–** శరీర గృహములో యజమానియైన ఓ ఆత్మా! వినుము. ప్రతి దినము కొంత కాలమైనను సంకల్పములు లేకుండా యోగమందుండిన కర్మ నశించిపోవును. జన్మకు కారణమయిన కర్మ తొలగి పోవుటచే జన్మలు లేని మోక్షము కల్గును. అట్లుగాక వేరు విధమున మోక్షము లభించదు.

**విశేషార్థము :–** మనస్సు ఎల్లవేళలా సంకల్పములు కలుగజేయుచుండును. సంకల్పములు కలుగుచూ ఎరుకగ (జ్ఞప్తి) యున్న స్థితిని జాగ్రత్తావస్థ యందురు. సంకల్పములు లేకుండా ఎరుకగా యున్న స్థితిని యోగమని అందురు. నిష్ఠయనగా ఒక పద్ధతి యని భావము. సమాధియనగా బుద్ధికి సమముగా యున్నది (ఆత్మ) అని అర్థము. ఎవడయితే ఆలోచనలు లేని ఒకే స్థితిలో యుండి ఆత్మను గ్రహిస్తూ తన ఆత్మ బుద్ధికి సమముగా మారి యుండునో వాడు పూర్వజన్మలలో సంపాదించు కర్మను లేకుండా చేసుకొనును. యోగము చేయు సమయములో యోగశక్తి లభించును, యోగశక్తి కర్మను కాల్చు ప్రభావముగలది. ఆ శక్తి యోగి శిరస్సున చేరి అక్కడ కర్మ చక్రములోనున్న కర్మను కాల్చివేయును. ఒక్క యోగశక్తి వలననే కర్మ లేకుండా పోవును. వేరు ఏ విధముగా కర్మ పోదు. కర్మ లేనపుడే జీవుడు శరీరమందు బంధింపబడక అంతటా వ్యాపించి పోవును. యోగము లేనిదే కర్మపోదు, కర్మ పోనిదే మోక్షము రాదు. అందువలన వేరు విధమును గనరాదు మోక్షమని చెప్పియున్నారు.

**ఆ ॥ నరుడు గురుని జేరి నాలుగు సేవలు**
**జేసెనేని నిజము జెప్పునయ్య**
**జెప్పగానె మాయ చప్పుడు చల్లారు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 55**

**భావము :-** హృది మధ్యలో నివాసముజేయుచూ సూత్రధారివై యుండి జీవుని పాత్రధారునిగా ఆడించు ఓ ఆత్మా! వినుము. నరుడు గురువును ఆశ్రయించి భక్తి భావము గలవాడై, గురువును పెద్దగా భావించుకొని స్థాన, అంగ, భావ, ఆత్మ అను నాలుగు రకముల సేవలుజేయుచుండిన గురువు ఆత్మ జ్ఞానమును భోదించును. ఆత్మజ్ఞానము వలన మాయ బలము తగ్గిపోవును.

**విశేషార్థము :-** మానవుడు బ్రహ్మ విద్యాన్వేషుడై ఆ విద్యగల గురువు యొద్దకు పోయి శాస్త్రనుసారముగా వినయ విధేయతలతో మెలగుచూ సాష్టాంగ దండ ప్రమాణము లాచరించుచూ నాలుగు సేవలుజేయుచుండిన ఆత్మజ్ఞానము ప్రాప్తించును. నాలుగు సేవలు **1) స్థాన 2) అంగ 3) భావ 4) ఆత్మ సేవలు.**

**1) స్థాన సేవ :** గురువు నివసించు ప్రాంతమును శుభ్రముగా నుంచుచూ, ఆ స్థలమును గురువు మనస్సుకు అనుగుణముగానుండుటకు తగిన కార్యములజేయుట స్థానసేవ యగును.

**2) అంగ సేవ :** గురువు శరీరమునకు సేవలుజేయుట అనగా శరీరమునకు కావలసిన ఆహార పానీయములు మొదలుకొని, దుస్తులు మొదలుకొని శరీర పోషణ, శరీర జీవనములో ఆరోగ్యముగా చూచుట మొదలగు కార్యములన్నిటినీ అంగసేవ అందురు.

**3) భావ సేవ :** గురువును తనకంటే పెద్దలయిన, పూజ్యులయిన తల్లి, తండ్రి దైవముగా భావించి, వారికిచ్చు గౌరవమునే గురువుకు ఇచ్చు చుండుటను భావసేవ యని అందురు.

**4) ఆత్మ సేవ :** గురు శరీరము నుండి వచ్చు ఆజ్ఞలను శిరసా ఆచరించు టయే ఆత్మసేవ యనబడును.

సేవలుజేయు శిష్యులను జూచి, గురువు వారి బ్రహ్మ విద్యా జిజ్ఞాసత్వమును పరిశీలించి, పరిపక్వమైన దశలోనే చెట్టు నుండి కాయలు కోసినట్లు, సేవలందు పరిపక్వదశకొచ్చినవారికి ఆత్మజ్ఞానమును బోధించును. దానివలన మాయ యొక్క వైపరీత్యము తగ్గి శిష్యుడు మాయతీతుడగును.

ఈ కాలములో గురువులే ముందు బోధ చేసినప్పటికీ శిష్యులు సేవలుజేయకున్నారు. సేవలేని బోధ గురువుకు బాకీపడునట్లుజేయును. ఆ రుణము తీర్చుటకు తిరిగి జన్మలెత్తవలసి వచ్చును. అందువలన సేవలు చేయని వారికి జన్మరాహిత్యము రాక జన్మ సాహిత్యము కల్గును.

పూర్వము పెద్దలు గురు సేవలు ఎంతజేసినా తీరనిదే యగునను భావముతో ప్రాణ, ధన, దేహములు గురువుకు సమర్పణయని, అన్నియూ గురువుకు అర్పించి, తాను తనదియను భావన లేకుండా యుండెడి వారు.

**ఆ ॥ ఏమి జేసితేమి యేకాగ్రచిత్తంబు**
**జేసెనేని తనకు జెల్లునయ్య**
**జెల్లుననుచు దుష్ట చెడువృత్తులు చేయునా**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 56**

**భావము :-** సమస్త జీవులందు ఏక కార్య స్వరూపుడయిన ఓ ఆత్మా!

వినుము. అర్థము తెలియని మనుజులు ఈ పద్యము నాధారముజేసుకొని సద్గురువులను కూడా ఎదిరించి మాట్లాడుచున్నారు. అందువలన ఈ పద్యమనకు పూర్తి వివరము తెలుసుకొనుట ప్రాముఖ్యము.

**"అపిచేదసి పాపేభ్య సర్వేభ్య: పాపకృత్తమ:**

**సర్వం జ్ఞానప్లవేనైన వృజినం సన్తరిష్యసి "**

**"పాపాత్ములలో నీవు అధమ పాపుడవైననూ, నీవు చేయు సర్వ కార్యములు పాపకార్యములే అయిననూ అన్నిటినీ జ్ఞానమను తెప్పచేత దాటగలవు"** అను గీతా వాక్యము ప్రకారము "ఏమి చేసితేమి ఏకాగ్రచిత్తము జేసెనేని తనకు జెల్లునయ్య" అన్నారు. ఏకాగ్రచిత్తమనగా ఏకమునకు అగ్రములోనున్న ఆత్మలో చిత్తమును కలుపడమని అర్థము. అంటే యోగ మని భావము. యోగి అయిన వాడు పూర్వ కర్మములను కూడా లేకుండా చేసుకొనును. కర్మల నశింపజేయు శక్తి తనకు గలదని యోగి అయిన వాడు అదే పనిగా చెడు కార్యములను చేయడు ఎందుకనగా! చెడు కార్యములైనా, మంచి కార్యములైనా మన ఇష్టప్రకారము జరుగవని యోగికి బాగా తెలియును. ఏది జరిగినా కర్మ ప్రకారమేనని నిశ్చితముగా తెలియును. అందువలన కర్మల నశింపజేయు శక్తి యుండినప్పటికి జరిగెడి పనులు మాత్రము తన చేతిలో లేనపుడు అదేపనిగా చెడువృత్తులు ఎట్లు చేయును.

గీతయందు కృష్ణుడు కూడా అర్జునునితో **"ఏ పనీ నీ చేతిలో లేదు. నీవు యుద్ధము చేయనని పట్టుబట్టినా, జరగవలసినది యుంటే తప్పక జరిగితీరును. నీ గుణములే నిన్ను ప్రేరేపించి యుద్ధము చేయించు నని"** తెలియజేసాడు. యోగులకు ఈ విషయము బాగుగా తెలియును. ప్రతి పనికి కర్మవలన ప్రేరేపితమైన గుణములే కారణమని తెలియును.

అటువంటపుడు చెడువృత్తులు గానీ, మంచివృత్తులు గానీ నేను చేయు చున్నానను ఉద్దేశముతో చేయడు.

సద్గురువుల యొద్దజేరిన మూర్ఖులు ఏ తప్పు దొరుకునాయని గురువును చూచుచుందురు. చిన్న తప్పు కనిపించినా విమర్శకులై పొందవలసిన జ్ఞానమునకు దూరమగుదురు. అందువలననే కొందరు పెద్దలు ఈ విధముగా **"ఖ్యాతిగా సద్గురువుజేరియు జ్యోతిని గనలేక, బాహ్యా చోద్యములచే కోతులవలె చరియించెడు పాతకులకెట్లు భవ్యగుణంబుల్"** అన్నారు.

యోగి అయిన గురువుకు పాపపుణ్య వ్యత్యాసముండదు. వెనుక కర్మవలన సంభవించెడు సమస్త కార్యములుజేయుచుందురు. తాము ఆచరించుచూ అట్లే కర్మలనంటని విధానమును శిష్యులకు బోధింతురు. అదియే కర్మయోగము. కర్మయోగ రహస్యము తెలియని శిష్యులు గురువు చేయు పనులయందు చిన్న చెడు కార్యము కనిపించినా వెంటనే బయటపడి పోవుదురు. గురువులనే హేళనగా మాట్లాడుదురు. కానీ కర్మయోగమును బోధించిన కృష్ణుని గీతనే ఆశ్రయించి, మేము ఆ గురువుకంటే గొప్పవారమే యనుచుందురు. గీతను చెప్పిన కృష్ణుడు ఎటువంటివాడని ఎవరయినా అడిగిన 'ఆయనకన్నీ చెల్లునని' అందురు. తనకొక పద్ధతి ప్రజలకొక పద్ధతి కృష్ణుడు చెప్పలేదు గదా! అందరికీ ఒకే సిద్ధాంతము గదా! ఆయన మానవునిగానే నటించి, ఆ సిద్ధాంతముల మీదనే నడిచాడు గదా! అని ఎవరయిన వివరముగా అడిగిన అర్థము తెలియని మనుజులు 'ఆయన దేవుడయా' యని సర్దుకొందురు.

గత జన్మ కర్మలననుసరించెయే కార్యములు జరుగుచున్నవనీ, తాను తలయందు సాక్షిగా చూస్తున్నాననీ, ఏ కార్యము చేయలేదను భావన

యోగికుండును. కావున తాను స్వయముగా కార్యములను చేయగలనను భావన యోగికి ఉండదు.

**ఆ ॥ అతడు బ్రహ్మ విష్ణు ఆనంద రూపుడు**
**అతని కేమి బాధ యాత్ర బోధ**
**సకల భూతసాక్షి సంపన్నుడై యుండు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 57**

**భావము :-** పురుషులందు రెండవ వాడయిన ఓ అక్షర పురుషుడా! వినుము. యోగి అయినవాడు బ్రహ్మ, విష్ణువు అనుభవించు ఆత్మానందమును అనుభవించుండును. అతనికి పాప పుణ్యముల బాధ యుండదు. సుఖ దుఃఖములందు చలించక జీవిత కాలమును ఆత్మబోధలయందే గడుపును. మరియు సకల జీవరాశుల శరీరములందు సాక్షిగానున్న ఆత్మయందు కలసియుండును.

**విశేషార్థము :-** యోగము చేయు వేళ లభించు శక్తిని బట్టి దేవతల పదవులు నిర్ణయింపబడినవి. దేవతలు యోగులందే యున్నారు. ఎక్కువ యోగశక్తి యున్న వాడిని విష్ణువనీ, రెండవవానిని శివుడనీ, మూడవవానిని బ్రహ్మయనీ ఈ విధముగా వారి పదవులు నిర్ణయింపబడినవి. మానవులందే గొప్ప యోగులుగానున్నవారే త్రిమూర్తులు. గొప్ప యోగులు అనుభవించు ఆత్మానందమును గురువు అనుభవించుచున్నాడు. కావున బ్రహ్మ విష్ణు ఆనంద రూపుడనీ యోగిగానున్న గురువుల గురించి పై పద్యములో చెప్పియున్నారు. అలాగే తన ఆత్మను తాను అనుభవము పొందుచున్నాడు గనుక సాక్షియైన ఆత్మ సంపన్నుడన్నారు.

**ఆ ॥ నేను నీవుయనుచు నిర్ణయం బెంచడు**
**భావమందు బ్రహ్మ భావమెరిగి**
**సావధానమతిని చక్కగ విహరించు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **58**

**భావము :-** సమస్త జీవులందు కదలిక శక్తి నిచ్చు ఓ ఆత్మా! వినుము. యోగి అయినవాడు నేను నీవుయనెడి బేధభావము లేక, ఆత్మ అన్నిటియందు ఒక్కటే విధమను భావముతో జాగ్రత్త గల మనస్సు గలవాడై చరించును.

**విశేషార్థము :-** "విద్యా వినయ సమ్పన్నే బ్రహ్మణే గవి హస్తిని, శుని చైవశ్వపాకేచ పండితా స్సమ దర్శిన:"

**"విద్యయు వినయముగల్గు బ్రాహ్మణులయందు, గోవులందు ఏనుగులందు, కుక్కలయందు, కుక్కలను తిను చండాలునియందు పండితులు సమభావమున యుందురు"** యని గీతా వాఖ్యమున్నట్లు 'నీవు నేనుయను నిర్ణయంబెంచడు' యని పై పద్యమునందు చెప్పబడినది. ఈ మాట విన్నంతనే అందరినీ ఒకే విధముగా గౌరవించవలయునని, ఒకరిని ద్వేషముతో ఒకరిని ప్రేమతో చూడకూడదని, మంచివారిని చెడ్డవారిని ఒకే విధముగా మాట్లాడించవలయునని అనుకొందురు. పై పద్యమందు గానీ, గీతయందు గానీ ఆ విధ భావములో చెప్పియుండలేదని గ్రహించ వలయును. ఆవును గౌరవించినట్లే పులిని గౌరవించిన పులి ఊరక యుండక మనకే హానిజేయును. సత్పురుషుని దగ్గరకు చేరినట్లే దుర్మార్గుని దగ్గర చేరిన, వాడు వెంటనే తన దుష్టబుద్ధిని ప్రయోగించి మనకే కీడు చేయును. మిత్రుని గౌరవించినట్లే శత్రువును గౌరవించిన శత్రువు మనకు ప్రాణహాని చేయును. అందువలన **"సమభావమనునది ఆత్మపట్ల చూపవలెను. ఆత్మ సమానముగానున్నదని తెలియువాడే పండితుడని"** గీత

భావము. ఆత్మ అన్ని జీవరాసులందు సమమే, అయినప్పటికీ జీవుల గుణములు వేరువేరుగానున్నవి. కావున జీవులను సమానముగా చూచుట అవివేకమగును. గీతయందు పరమాత్మయే చెడ్డ గుణములు గలవారిని రాక్షసులుగా వర్ణించి, వారికి అధోగతి జన్మలు కలుగుననీ, తనను తెలుసుకొను జ్ఞానము వారికి ఏమాత్రము లభించదని తెలిపియున్నాడు. అన్ని విధములుగనున్న జీవులను సమానముగా జూడక, అన్ని రకాల జీవరాసులందు సమానవృత్తి కల్గి యున్న ఆత్మను సమానముగా చూచువాడే యోగి, పండితుడని పద్య భావము. అందువలననే **"భావమందు బ్రహ్మ భావమెరిగి"** అని చెప్పబడినది.

'మతి' యనగా మనస్సు. సావధానమనగా జాగ్రత్త యని అర్థము. ఆత్మ సమానత్వమను మనోజ్ఞప్తి గలిగి చరించువానిని సావధానమతి చక్కగా జరించువాడని చెప్పడమైనది.

**ఆ ॥ మంత్ర సిద్ధుడతనిమార్గంబు మార్గంబు**
**జగతియందు అతని జన్మ జన్మ**
**అతని వెంట దిరుగు అమిత దేవగణంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 59**

**భావము :–** ముందు నీవుండి నీవెనక జీవున్ని పెట్టుకొనిన ఓ ఆత్మా వినుము. గురువు మహిమగలవాడై ఆయన నడిచిన జ్ఞానమార్గమే అన్ని మార్గములకంటే గొప్పది. ప్రపంచములో గురువు పుట్టిన జన్మయే అందరి జన్మలకంటే ఉత్తమమైనది. ఆయన వెంట దేవతలు గుంపులు గుంపులుగా తిరుగుచుందురు.

**విశేషార్థము :– "ద్వౌభూత సర్గౌ లోకేస్మిన్ దైవ అసుర ఏవచ" "దేవతలు రాక్షసులు అను రెండు రకముల జీవులు భూమి మీద పుట్టుచున్నారు".**

అను గీతాచార్యుని వాక్యము ప్రకారము భూమి మీదనే సమస్త దేవతలు ఉన్నారు. యోగులందరినీ దేవతలనే చెప్పవచ్చును. వారికున్న యోగశక్తిని బట్టి వారికి దేవతా పదవులు నిర్ణయింపబడినవి. గురువుల వెంట దిరుగువారు యోగసాధకులు, యోగులై వుందురు. అందువలన గురువు వెంటనుండువారిని దేవగణములనుచూ అతని వెంట దిరుగు అమిత దేవగణంబు యని పద్యములో చెప్పినారు.

శరీరములో ఉద్భవించు "ఓం" కార మంత్రమును సిద్ధి పొందిన వాడు గురువు. మంత్ర సిద్ధి అనగ "ఓం" కారము ఏ శక్తి వలన ఉద్భవించుచున్నదో ఆ శక్తిని పొందడము, లేక ఆ శక్తిలో ఐక్యమవడమని అర్థము. శ్వాసకు మహిమను చేర్చు ఆత్మ శక్తిలో ఐక్యమయిన గురువును మంత్రసిద్ధుడని చెప్పడమైనది. అతను అనుసరించు మార్గము గొప్పది కావున అతని మార్గమే మార్గమని చెప్పడమైనది. ఆత్మను తెలుసుకొనుటయే జీవిత సాఫల్యముగావున్న అతని జన్మయే జన్మయని చెప్పడమైనది.

**ఆ ॥ అతని దర్శనమున అడవిలో జనులకు**
**పాపమెల్ల బాసి పరమగతికి**
**త్రోవ వెదుకుటకును దోచును మనసందు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 60**

**భావము :-** పరమాత్మ ప్రక్కనుంచుకొని జీవునితో కలసియుండి శరీరముతో పనులు చేయు ఓ ఆత్మా! వినుము. అడవిలోయున్న జనులకైననూ గురు దర్శనము వలన కొంత పాపము నశించిపోయి, వారి మనసున మోక్షము పొందుటకు తగిన జ్ఞానమార్గము వెదుక వలయునను ఆలోచన పుట్టును.

**విశేషార్థము :-** గురువు యొక్క చూపు అజ్ఞానుల మీద ప్రాకినపుడు, గురువు తలంపువలన ఆయనందుండు యోగశక్తి ఆయన చూపు ద్వారా ప్రసరించి

అజ్ఞానుల కర్మచక్రములోని జ్ఞానమార్గమున కాటంకమైన కర్మమంతటినీ కాల్చివేయుట వలన అజ్ఞానులలో కూడా జ్ఞాన జిజ్ఞాస కలుగును. గురు దర్శనము వలన కర్మలు పోవునను భావముతోనే "సాదుదర్శనమ్ పాప నాశనమ్" అని పెద్దలన్నారు.

**ఆ ॥ సజ్జనులనుగాంచి సాష్టాంగ పడలేక**
**మొగ్గి తగ్గి కోడి ముదిసినట్లు**
**టఙ్ఞ గఙ్ఞ పెద్దదాబు బడైచూపు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 61**

**భావము :-** అన్ని జీవులందు వేరు వేరుగా కలిసియున్న ఓ ఆత్మా! వినుము. గురువులను చూచి నమస్కరించక, కోడి పందెములోని కోడి మెడ చుట్టూ ఈకలన్నిటినీ పైకిలేపి తల పైకి క్రిందికి ఆడించుచూ, డంబము చూపునట్లు మూర్ఖులు కూడా గురువుల యెడల తమ పెద్ద డంబమును చూపుచుందురు. వాడు కూడా నా మాదిరి మనిషే కదా! నాకంటే వాడేమి పెద్దాయని పెద్ద బడాయికల్గి అసూయ చూపు చూచుచుందురు.

**ఆ ॥ వద్దు వద్దు యికను వస్తాదు తనములు**
**ప్రొద్దుపోయె జగతి పొంత మాయె**
**కొద్ది గడయు దీని గుట్టెల్ల జెడిపోయె**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 62**

**భావము :-** శరీరము వెలుపల ఏమాత్రమూ లేక లోపల మాత్రము చైతన్యముగానున్న ఓ ఆత్మా! వినుము. నీవు విడచు ప్రతి శ్వాసకు కాలము గడిచిపోవుచున్నది. దిన దినము నీ ఆయుస్సు తగ్గిపోవుచున్నది. శరీరమును వదలిపోవు కాలము ఆసన్నమవుతున్నది. ఇక ప్రపంచపు పెద్దరికముల

వదలిపెట్టి, ఆత్మజ్ఞానముచే నిన్ను నీవు తెలుసుకొనుము. ఆత్మజ్ఞానమే అతిరహస్యము. కొద్దిగా మిగిలియున్న జీవిత శేషము అయిపోయిన తెలియవలసిన రహస్యము తెలియకపోవును. అందువలన నీజీవితమే వృధా యగును. ఇప్పటికయినా వస్తాదు తనము వీడి వినయము కల్గి జ్ఞానము యొక్క గుట్టు తెలియుము.

**ఆ ॥ పర్వతంబుకంటే భారమై యుండును**
**శుభకరంబు మోక్ష శోభనంబు**
**గురుని భక్తి లేని కుచ్చితులకెల్లను**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 63**

**భావము :-** అఖిల జీవులందు కలిసియున్న ఓ ఆత్మా! వినుము. గురు భక్తిలేని శిష్యులకు గురువు బోధించు మోక్షమార్గము చాలా కష్టముగా యుండును.

**విశేషార్థము :-** కొందరు గురువులవద్ద చేరియు వారికున్న కపట గుణము లను వదలక, మనస్సున భక్తి లేకున్నను పైకి భక్తియున్నట్లు నటించుచూ, గురువు బోధించు నిజ మోక్ష జ్ఞానమార్గమును పెద్ద భారముగా మోయు చుందురు, ఎన్నాళ్లు బరువు మోయగలరు? ఏదో ఒక రోజు క్రింద వేయవలసిందే. కనుక అటువంటి కుచ్చితబుద్ధి గల భక్తులు గురువును వదలిపోవు మార్గమును వెదకుచుందురు.

**ఆ ॥ అల్ప సంశయంబు లర్థ విరోధముల్**
**తనకు లేని తత్వ ధర్మములను**
**గూర్చి ప్రశ్న జేయు కుమతుల ధరలోన**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 64**

**భావము :-** మూడు గుణములకు వేరుగవున్న ఓ ఆత్మా! వినుము. గురుభక్తి

లేనివారు గురువు చెప్పు విషయములను అర్థము చేసుకోలేక అల్ప సంశయములతో కూడుకొని వాటిని గురించి వినయముగా అడిగి తెలుసు కొనక విరోధభావముతో ఆచరణ లేని ఆత్మ విషయములను ప్రశ్నించు చుందురు.

**విశేషార్థము :-** భక్తి లేని జనులు గురువు సాన్నిధ్యమును బంధనముగా దలచి, కేవలము ప్రపంచ విషయములతో గురువును పోల్చుకొనుచూ గురువు కంటే మనమేమిటియందు తక్కువగయున్నామనుకొని, తనకు మాలిన ధర్మములను గురించి ప్రశ్నించుచుందురు. గురువు చెప్పిన విషయములు సాధన ద్వారా అనుభవమునకు వచ్చును. కానీ సాధన చేయకనే అనుభవమునకు రాకనే ఆ విషయములను గురించి ప్రశ్నించు చుందురు.

ఉదాహరణకు శ్వాస బ్రహ్మనాడి ఏడు కేంద్రముల శక్తి ద్వారా ఆడుచున్నదనీ, ఒక్కొక్క నాడీకేంద్రము నుండి కొన్ని వందల శ్వాసలు జరుగుచుండుననీ, శ్వాస జరుగుటకు బ్రహ్మనాడిలోని శక్తి ఏడు భాగములుగానున్నదనీ, ఒక్కొక్క భాగములో గల శక్తిని బట్టి శ్వాసలు జరుగు చుండుననీ గురువు చెప్పిన ఆ విషయములను కపట భక్తుడు ఆచరించకనే, అనుభవమును పొందకనే గురువు చెప్పిన మాట మీద నమ్మకము లేనివాడై, అనుమానముగల వాడై, విరోధభావము మనస్సులో యుంచుకొని బ్రహ్మ నాడిలోని శక్తి ద్వారానే శ్వాస జరుగునని ఏమి నమ్మకమని ప్రశ్నించును. ఆ ప్రశ్నకు గురువు జవాబు చెప్పాడనుకొనుము, తర్వాత ఏడు కేంద్రములలో ఒక్కొక్క దానియందు కొన్ని వందల శ్వాసలే అన్నారే అన్నియే ఎందుకాడవలయునని ప్రశ్నింతురు. అందులకు గురువు సమాధానము జెప్పినా, తిరిగి ఏడే కేంద్రములున్నట్లు నీకే విధముగా తెలియునని, ఒక కేంద్రములో ఇన్నియే శ్వాసలాడుటకు ఆధారమేమియని ప్రశ్నింతురు. ఈ

విధముగా అనుభవించితే కానీ తెలియని విషయములను ఆచరణలేకయే అడుగువానిని చూచి గురువు ఏమీ చెప్పకపోతే క్రింది విధముగా అనుకొందురు.

**ఆ ॥ అట్టి ప్రశ్నలకు ఆ ఈశ్వరుండైన**
**చెప్పకూరకుంటె చపలులెల్ల**
**చప్పగానున జూచి చప్పట్లు జరుతురు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 65**

**భావము :-** జీవుల ప్రక్కనేనున్న ఆత్మా! వినుము. చెప్పిన మాట మీద నమ్మిక లేనివారికి, భక్తి భావము లేనివారికి సేవలు చేయని వారలకు ఆత్మబోధ చెప్పకూడదను భావముతో, తనకు మాలిన, పనికి మాలిన ప్రశ్నలు జేయువారికి ఆ ఈశ్వరుడే సమాధానము చెప్పకుండిననూ చపల బుద్ధిగల భక్తులు చిన్నతనముగా జూచి హేళనగా మాట్లాడురు. గొప్ప గురువులను కూడా తమ నీచత్వముతో హీనముగా ప్రచారముజేయుదురు.

పై మూడు పద్యములు కపట శిష్యులను గురించి చెప్పినవి. ఇక కపట గురువులను గురించి చెప్పు పద్యము క్రింద గలదు.

**ఆ ॥ దాసు లధికమాయె దండముల్మెండాయె**
**కాసులకుపదేశ కాలమాయె**
**యేమి జెప్పనాయె ఈశ్వర తత్వంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 66**

**బావము :-** కాగిన ఇనుములో అగ్ని యున్నట్లు, సమస్త జీవుల శరీరము లందు ఇమిడి యున్న ఓ ఆత్మా! వినుము. కొందరు కపట గురువులు బయలుదేరి ఆత్మ ధర్మము తమకు తెలియకున్నప్పటికీ వాటిని గురించి

శిష్యులకు ఏ విధముగా తెలియజేయకనే, ఉపదేశము ముఖ్యమని చెప్పుచూ, ఉపదేశము ఇచ్చుటకే గురువుండేదనుచూ, ఆ ఉపదేశము కోసమే గురువు వద్దకు ప్రజలు రావలయునని బోధించుచూ, వ్యాపారము చేసినట్లు డబ్బుకు ఉపదేశమిచ్చుచు, శిష్యుల సంఖ్య పెంచుకొనుటయే తమ ధ్యేయము అనుకొనువారున్నారు. అటువంటి కపట గురువు చేతిలోని బ్రహ్మజ్ఞానము హీనదశకు వచ్చి విలువలేనిదై శాస్త్రబద్ధత లేనిదై పోయినది.

ఆ ॥ **రత్నగనులయందు రాజహంసున్నట్లు**
**తత్వవేత్త యల్ప తలపు లేక**
**నిత్య మొక్క రీతి నిజ సమాధిని యుండు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **67**

**భావము :-** సూర్యుడొక్కడు ఈ లోకమును ప్రకాశింపజేయునట్లు శరీర మంతటినీ నీ ఒక్కనివే ప్రకాశింపజేయు ఓ ఆత్మా! వినుము. రత్నములు అధికముగా లభించు గనులలో రాజహంస యుండి రత్నమునే తినుచూ వేరే ఏ పదార్థములను తినక యున్నట్లు. ఆత్మను (తత్త్వము) తెలుసు కొన్నవాడు ప్రక్క విషయముల ఆలోచనలు లేకుండా ఎప్పటికీ శరీరమున యోగమునే అనుభవించుచూ కర్మ అంటని విధానములో బుద్ధిని అహర్నిశలు సమానత్వము కల్గించి యుండును.

ఆ ॥ **మాట లధికమాడ మౌనికి మరిపుండు**
**కోట చెడిన రాజు కోతిపుండు**
**పేదవాని బ్రతుకు పెక్కు విధముల పుండు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **68**

**భావము :-** నాశరహితునివై నాశనముకాగల జీవాత్మతో కూడివున్న ఓ

ఆత్మా! వినుము. పేదవాని బ్రతుకు అనేక విధముల బాధలతో కూడి యున్నట్లు, కోతిపుండు మానని రీతిగా, రాజ్యము పోయిన రాజు బాధపడి నట్లు, మౌనము కల్గిన యోగికి మనస్సు చలించుటకు మొదలిడిన ఆయన మిక్కిలి బాధపడును.

**విశేషార్థము :-** మనస్సు యొక్క సంకల్పములధికమగుటను మాట లధికమాడ యని చెప్పబడినది. మనస్సు నిలిచిపోవుటనే మౌనమని తలంచ వలయును. మనస్సును నిల్పువాడే మౌని (యోగి). పోయిన రాజ్యమును గురించి రాజు బాధపడినట్లు, బీదవాడు తాను పొందుతున్న కష్టములను ఓర్వలేక తనకు ధనము లేకపోయెనని బాధపడినట్లు, యోగి అయినవాడు యోగభ్రష్టుడయితే కోల్పోయిన తన యోగమును గురించి చాలా బాధపడును.

**ఆ ॥ గురువులందు మంచి గుణవంతులందు**
**కోరచూపు మనసు కోపరూపు**
**చపలు డిట్టులుండు చిరవానరము రీతి**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 69**

**భావము :-** పూసల మధ్యలో ధారమున్నట్లు జీవుల శరీర మధ్యలో శరీరమంతటికీ ఆధారమైయున్న ఓ ఆత్మా! వినుము. కోతిపిల్ల ఇతరులను ఊరకనే వెక్కిరించుచున్నట్లు, చపలతత్వముగల మూఢులు గురువుల యెడల మరియు మంచి గుణవంతుల యెడల క్రోధము కల్గియుందురు. మరియు వారి యెడల నీచముగా ప్రవర్తించుచుందురు. వారు చపల చిత్తులై యుండి తమవలెనే అందరిని తలచుచుందురు.

**ఆ ॥ మంచివారు లేరు మహినీస్థలంబున**
**మనకు వలదు దుష్టమతుల చెల్మి**
**మంచి కొరకు నీదు మౌనంబు బూనుము**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 70**

**భావము :-** ఎడతెరిపి లేక ఎల్లకాలములందు జీవునితో కలిసియున్న ఓ ఆత్మా! వినుము. దైవత్వము గలవారు భూమి మీద తక్కువగా యున్నారు రాక్షసత్వముగల వారు ఎక్కువగానున్నారు. రాక్షసుల చెల్మిచేయక దైవత్వము కొరకు నీవు యోగముజేయుము.

**విశేషార్థము :-** యోగము చేసిన యోగశక్తి లభించును. ఆ శక్తిని బట్టి దైవత్వము నిర్ణయింపబడును. విష్ణు, ఈశ్వర, బ్రహ్మ మొదలుకొని మిగతా దేవతల పదవులన్నియూ ఆత్మశక్తిని బట్టి యుండును. ఆ శక్తియే దైవత్వమునకు కారణమనుటకు దేవతా చిత్రపటములందు వారి తల భాగమున వెలుగుగా ఆత్మశక్తిని చిత్రించియున్నారు. దైవత్వమును పొందుటకు యోగము చేయవలయునను సందేశమును తెల్పుచూ మౌనముగా యుండుమని పద్యములో చెప్పియున్నారు.

**ఆ ॥ మౌన మనుచు భ్రమసి మాటల మానిన**
**మౌన మదియుగాదు మాయ విడదు**
**మనసు కల్మసంబు మానిన మౌనంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 71**

**భావము :-** చర ప్రకృతియైన శరీరమంతటా వ్యాపించివున్న ఓ ఆత్మా! వినుము. మౌనముగా యుండవలయునని కొందరు మాటలు మానివేసి నిశ్శబ్ధముగానున్నారు. మౌనమనగా మాటలు మానివేయడము గాదు. మాటలు మానివేసినంతమాత్రమున మాయ విడదు. మనస్సు గుణ సంబంధ

విషయములను జ్ఞప్తికి తెచ్చుచునే యుండును. గుణములు చెలరేగుచునే యుండును. అందువలన మౌనమనగా మాటలు మానుట గాదని, మౌనమనగా మనస్సు ఏ విషయములను జ్ఞప్తికి తేకుండా ఉండడమని తెలియవలయును.

**ఆ ॥ కాయసిద్ధికోరి గగనంబులనుజేరి**
**వాయు భక్షణమున వసరెనేని**
**మాయ తనువు తుదకు మంటిపాలైపోవు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 72**

**భావము :-** పంచభూత నిర్మాణమైన శరీరమునకు ఆధారముగానున్న ఓ ఆత్మా! వినుము. స్థిరకాలము బ్రతుక వలయునను ఉద్దేశముతో గాలిని శ్వాస ద్వారా కుంభించుచూ, శరీరమును గాలియందు తేల్చి వేయుచూ ఇదియే పెద్ద యోగమనువారు కలరు. ఎంతకాలము బ్రతికినా గుణములతో కూడుకొన్న శరీరము చివరకు మట్టిపాలై పోవును.

**విశేషార్థము :-** శ్వాసను కుంభించుట వలన ఆయుస్సును పెంపొందింప జేయవచ్చును. అందువలన కొందరు శరీరమును తొందరగా వదలకుండా చాలా కాలము బ్రతుకుటకు వాయుభక్షణ జేయుచున్నారు. వాయువును కుంభించి శరీరమును భూమి నుండి 4 లేక 5 అడుగుల ఎత్తువరకు ఆకాశమున తేలునట్లు ఆత్మయందు ఆసక్తి లేనివారు ప్రాణాయామము చేసి ఇదియొక యోగమనుచున్నారు. విద్యనేర్చి గాలిని కుంభించినప్పటికీ మోక్షము రాదు, అది యోగము కాదు. అట్లుజేయుటవలన ఎన్నాళ్ళు బ్రతికినా చివరకు "జాతస్య హి(ధ్రువో మృత్యు" అను వాక్యము ప్రకారము శరీరము విడువవలసినదేయగును.

**ఆ ॥ యోగములను రాజయోగంబు మరి హెచ్చు**
**మంత్రములను ప్రణవ మంత్రమెచ్చు**
**పంచముద్రలందు పరమ శాంభవి హెచ్చు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 73**

**భావము :–** పరమాత్మవూ కాక, జీవాత్మవూ కాక కేవలము ఆత్మవై జీవాత్మతో పాటు శరీరములోనున్న ఓ ఆత్మా! వినుము. దేవున్ని తెలియుటకు, మోక్షము పొందుటకు అనేకమార్గములున్నవని ఎందరో అనుచుండుట వినియే ఉన్నాము. ఈ మాట సత్యమా అని చూచితే అన్ని విధముల అసత్యముగానే కనిపిస్తున్నది. ఎందుకనగా! అన్నికంటే ముఖ్యము బ్రహ్మవిద్యలో ప్రామాణిక గ్రంథము, స్వయముగా దేవుడే తెలియజేసినది భగవద్గీత గ్రంథము. అందులో దేవున్ని తెలియుటకు దేవుడే తెల్పిన మార్గములు మూడే మూడు గలవు. దేవుడు సుస్పష్టముగా తెల్పినవి మూడు మార్గములు మాత్రమే. ఆయన తెల్పిన మూడు మార్గములు మినహా ఏ మతములోనూ మరియొక మార్గము లేదు. ఇస్లాం, క్రైస్తవ మతములలో కూడా ఈ మార్గములకు మినహా దేవుడు చెప్పలేదు. గీతలో దేవుడు చెప్పిన మూడుమార్గములలో ఒకటవదయిన బ్రహ్మయోగము, రెండవదయిన రాజయోగము ఇందూ మతములో ఎక్కువ ప్రచారముండగా, మూడవదయిన భక్తియోగము క్రైస్తవ ఇస్లాం మతములలో ఎక్కువగా గలదు. భగవద్గీతను చదివిన వారికే దేవున్ని చేరుటకు మూడు మార్గములున్నవని తెలియనిస్థితి ప్రస్తుత కాలములో గలదు.

దేవున్ని తెలియుడములో లేక దేవుని వద్దకు చేరడములో రాజయోగము మనిషికి చాలా అవసరమైనది. మనిషి నిత్య జీవితములో కర్మలు ఆచరిస్తూ అనుభవిస్తూ క్రొత్తకర్మను సంపాదించకుండా చేయునది

రాజయోగము (కర్మయోగము). కావున పై పద్యమందు యోగములందు రాజయోగంబు హెచ్చు అన్నారు. అదే విధముగా శబ్దముతో కూడుకొన్న మంత్రములు కూడా గలవు. మంత్రములు దైవసంబంధమైనవి మరియు ప్రపంచ సంబంధమైనవి రెండు విధములు గలవు. వాటిలో దైవ సంబంధమైన మంత్రములలో అన్నికంటే ముఖ్యమైనది "ఓం" కార శబ్దము గలది. ప్రతి మనిషి యొక్క శ్వాసలో ఇమిడియున్న ఓం శబ్దమును ప్రణవమని అనుచున్నారు. ఈ శబ్దము శరీరములోని ఆత్మ చేత పలుకబడుచున్నది. కావున పరమాత్మను తెలియుటకు ముఖ్యమైనది ఓం కారమని చెప్పారు. ఇది మనిషియైన ప్రతి ఒక్కరిలోనున్నది కావున కుల మత ప్రసక్తి లేకుండా దీనిని అనుసరింపవచ్చును. అందువలననే పై పద్యములో **"మంత్రములలో ప్రణవమంత్రమెచ్చు"** అన్నారు.

ఇందూ మతములో పంచముద్రలని కొందరు పేర్లు పెట్టుకొన్నవి గలవు. ఇవి ఏవీ భగవద్గీతలో దైవప్రోక్తములు కావు. అందువలన వీటిని గురించి పూర్తి మాకు తెలియదు. కొందరు ప్రజల భావము ప్రకారము ఖేచరి, భూచరి, మధ్యలక్ష్మి, షణ్ముఖి, శాంభవీ అను ఐదు ముద్రలు గలవు. తల చక్కగా పెట్టుకొని కంటిలోని నల్లగ్రుడ్డును సాధ్యమున్నంతవరకు పైకి త్రిప్పి చూస్తు ఉండిపోవడమును ఖేచరి ముద్ర అని అందురు. రెండవది నల్లగ్రుడ్డును పూర్తి క్రిందికి త్రిప్పి చూస్తు కదలకుండా ఉండమును భూచరి ముద్ర అందురు. చూపును పైకి క్రిందికి కాక సమాంతరముగా మధ్యలో పెట్టి చూస్తుండమును మధ్యలక్ష్మి ముద్ర అందురు. ఈ మూడు విధములుగాక 1) పైకి 2) క్రిందికి 3) మధ్యలోనికి 4) కుడి ప్రక్కకు 5) ఎడమ ప్రక్కకు 6) పూర్తి చుట్టుగా కన్నును త్రిప్పు చుండడము యొక్క ఆరు విధములను షణ్ముఖి అందురు. ఇవన్నియూ కాక ముక్కు కొన భాగమును చూడడమును శాంభవీ ముద్ర అందురు.

ఈ ఐదు ముద్రలలో శాంభవీ ముఖ్యమైనదని కొందరనుచుందురు. వీటిలో శాంభవీ ముద్రకంటే వేరు విధానమును పరమ శాంభవీ అంటారు. పరమ అనగ వేరయినది వేరుగనున్నదని అర్థము. పరమ శాంభవి అనగా శాంభవీ ముద్రలకంటే వేరయినదని అర్థము. అనగా ఐదు ముద్రలు కానటువంటి యోగము అని అర్థము. **చూపు నిల్పు విధానములు అన్నిటికంటే మనస్సును నిల్పు బ్రహ్మయోగము ముఖ్యమైనది.** కావున ముద్రలలో పరమ శాంభవి హెచ్చు అన్నారు. ముద్ర అనగా కదలక కూర్చోవడమని అర్థము. కదలక కూర్చొని చూపు నిల్పుటకంటే మనసు నిల్పు బ్రహ్మయోగము ముఖ్యమగుట వలన పరమ శాంభవి హెచ్చు అన్నారు.

**ఆ ॥** **రాజయోగ మోక్ష రాజ్యాభిషిక్తుడై**
**తనదు గృహమున నున్న ధర్మమెల్ల**
**పాలనంబు చేసి పరవశుడై యుండు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **74**

**భావము :-** మొదటిదయిన జీవాత్మకు మూడవదయిన పరమాత్మకు మధ్య సంధానమైయున్న ఓ రెండవ ఆత్మా! వినుము. కదలక కూర్చొని మనస్సు నిల్పునది బ్రహ్మయోగము కాగా, దానికంటే ఉత్తమమైనది కర్మయోగము. ఈ రెండు యోగములలో పెద్దది శ్రేష్టమైనది కర్మయోగము కావున గొప్పతనమును సూచించు రాజ పదమును చేర్చి కర్మయోగమును రాజయోగము అనడము కూడా జరిగినది. రాజయోగములో అందరి వలె పనులు చేయుచూ, శరీరములోని బయట అవయవముల పనుల ప్రకారము పనులు చేయిస్తూ, అలాగే లోపలి మనో బుద్ధి చిత్తములను వాటి ధర్మము ప్రకారము పనులు చేయిస్తూ, అహము యొక్క పని తెలిసినవాడై శరీరములోని అనుభవములను అనుభవించడము జీవుని

ధర్మమని తెలిసి, అన్నిటికీ అతీమైనది మోక్షమని దానికొరకు శరీర ధర్మ పాలన చేయు రాజయోగి తన వశములోకలదేదీ లేదని అంతయూ పరవశమని తెలిసి పరవశుడై యుండును.

**ఆ ॥ బంటులింద్రియంబులు పనులెల్ల జేయంగ**
**మనసు మంత్రిగాను మసలుచుండు**
**తన్ను తాను గన్న తత్వంబు తద్రూపు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 75**

**భావము :-** కాగిన ఇనుములో ఇనుమంతయూ అగ్ని వ్యాపించినట్లు శరీరమంతా వ్యాపించి యున్న ఓ ఆత్మా! వినుము. శరీరమును ఒక రాజ్యముగా పోల్చుకొని చూచినట్లయితే ఇంద్రియములు బంటులుగా పని చేయుచున్నవి. మనసు మంత్రిగా కార్యముల జ్ఞాపకము చేయుచుండగా, ఆత్మ రాజుగా యుండి తన పరివారమునకు శక్తి అను జీతమిచ్చి పని చేయించుచున్నది. పనుల ఫలితమును ఆత్మ అనురాజు పరిపాలనలోని జీవుడు అను ప్రజలు అనుభవించుచున్నారు. తన ఆత్మను చూచుకొన్న జీవుడు 'యాదారాజా ప్రజా' అన్నట్లు తాను కూడా ఆత్మవలె చిన్న రూపమున్న జీవాత్మననీ తెలియును. తాను కూడా శరీర రాజ్యమునకు అధిపతిగానున్న ఆత్మవలె మారవలెనని ప్రయత్నించును. చివరకు సామంత రాజుయిన ఆత్మవలె మరియు సామంత రాజులకు పెద్దయిన చక్రవర్తివలె మారవలెనని ప్రయత్నించును. జీవునికి చక్రవర్తి అయిన పరమాత్మగా మారిపోవలెనను ఉద్దేశము కలుగవలెనంటే మొదట తన రాజ్యములోని సామంత రాజయిన ఆత్మరాజును చూచి రాజరికమంటే ఏమిటో తెలియవలెను.

**ఆ ॥ పంచవింశ కుండు పాపపుజీవుండు**
**సంచి తాగమాది సకల కర్మ**
**లోలుడగుచు తిరుగు లోవెలి గురితప్పి**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 76**

**భావము :-** పరమాత్మ పాలించు విశ్వమను సామ్రాజ్యములో శరీరమను సామంత రాజ్యమునకు రాజయిన ఓ ఆత్మా! వినుము. పంచభూతము లయిన ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి చేత తయారయిన శరీరముతో కూడుకొన్న జీవుడు కర్మత్రయమయిన సంచిత, ఆగమ, ప్రారబ్ధ కర్మలచే నిండుకొన్నవాడై ప్రారబ్ధమును అనుభవిస్తూ ఆగమకర్మను ఆహ్వానించువాడై ఉన్నాడు. ప్రపంచములో నిత్యము కర్మలోలుడయిన జీవుడు బయట ప్రపంచ దృష్టికల్గి జీవనమును గురించి ఆలోచించువాడై సమయమునంతటినీ దానికే వినియోగించుచున్నాడు. తన శరీరము లోపల అంతటా వ్యాపించిన ఆత్మను గురించి కానీ శరీరము బయట అంతట వ్యాపించిన పరమాత్మను గురించిగానీ ఏమాత్రము ధ్యాస గానీ, ఆలోచనగాని లేనివాడై జీవితానికి ధ్యేయమంటూ లేక తిరుగుచున్నాడు.

**ఆ ॥ విత్తుచేత చెట్టు వెలసిన రీతిగా**
**కర్మచేత జన్మ కల్గు చుండు**
**కర్మ భ్రాంతి విడదు కలియుగాత్ముల కెల్ల**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 77**

**భావము :-** ప్రపంచమంతటికీ గల ముగ్గురు పురుషులలోనూ మధ్య పురుషుడవై అక్షర పురుషుడని పేరుగాంచి క్షరపురుషుని వద్ద నిలచిన ఓ ఆత్మా! వినుము. భూమిమీద విత్తనము చేత చెట్టు పుట్టుచున్నది. అదే విధముగా కర్మ కారణము చేత జీవునికి జన్మ కల్గుచున్నది. ఇది సర్వధా

సహజముగా జరుగుచున్న పని. మనిషి పుట్టుచున్నపుడు సంతోషించువారు చనిపోవునపుడు బాధపడువారు చావు పుట్టుకలకు కారణమయిన దొకటున్న దని అదియే కర్మ అని తెలియలేకున్నారు. కలియుగాత్ములకు కర్మ భ్రాంతి విడచి కర్మ యొక్క నిజరూపము తెలిసినపుడు మోక్షము పొందగలడు. కర్మంటే ఏమిటో తెలియక, కర్మను వేరు విధముగా ఊహించుకొని అన్ని కార్యములకు తన నిర్ణయమేనని తాను అనుకొన్నట్లే చేయగలనని అనుకొను వారికి భ్రాంతి విడువదు, జ్ఞాన సత్యము తెలియదు, మోక్షము రాదు.

**ఆ ॥ సకల సంకటంబు సంసార సంకుల**
**జంక డొంక వంక రంకు బొంకు**
**చాలునయ్య దీని చప్పుడీ చొప్పున**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 78**

**భావము :-** శరీరములో సకలేంద్రియములకు శక్తినిచ్చు ఓ ఆత్మా! వినుము. మనిషికి రెండు రకముల సంసారములు గలవు. సంసారము అనగా సారము లేనిదని పెద్దలు చెప్పుచుందురు. సంసారము కుటుంబముతో కూడుకొన్నదని కూడా చెప్పుచుందురు. మనిషి బ్రతకడమే సంసారమని కూడ కొందరనుచుందురు. ఎవరేమనుకొనినా నాకు తెలిసినంత వరకు మనిషికి బయట సంసారము మరియు లోపలి సంసారమని రెండు రకములు గలవు. బయటి సంసారము తన చుట్టూయున్న మనషులతో కూడుకొని యుండును. బయటి సంసారము బయటి ప్రజలతో కలసి చేయుపనులతో ఉండును. వ్యభిచారము, దొంగతనము, అసత్యము, జూదము, మోసము, పలు విధముల పనులతో కూడుకొనియుండును. అట్లే కొన్ని మంచి పనులతోను కొన్ని చెడుపనులతోను ఎన్నో ఒడుదుడుకులతోను బయటి సంసారముండగా లోపలి సంసారము మరియొక విధముగా ఉండును.

జీవుడు శరీర గృహములో నివశిస్తూ మనస్సు, బుద్ధి, చిత్తము, అహము అను అంతఃకరణములతోను జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను అవయవ ములతోను కలసి కాపురము చేయడమని తెలియవలెను. లోపలి గుణము లను బట్టి లోపలి ఇంద్రియములు బయటి ఇంద్రియములు పని చేయు చుండగా, ప్రపంచములో అవి మంచి చెడు కార్యములుగా పరిగణింపబడగా, జీవుడు సారము లేని జీవితమును గడుపుచున్నాడు. శరీరము లోపలి ఇంద్రియములతోనూ, బయటి పనులతోనూ జరుగబడునవి రెండు రకముల సంసారములు. సంసారములో సారము లేదు అన్నట్లు చేయుచున్నాడు, శరీరము బయటగల సంసారమును సత్ సారముగా మార్చుకొను విధానము గలదు. సంసారమును సత్ సారముగా మార్చుకొనుటకు క్రింద చెప్పిన పద్యమును చూచెదము.

**ఆ ॥ త్రిగుణ రూపమాయె త్రిపురంబు లెల్లను**
**త్రిగుణ మందు జగము తిరుగుచుండు**
**త్రిగుణమిడిచి ముక్తి తెరవును గనవలె**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 79**

**భావము :-** బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములకు ఇరుసుగానున్న ఓ ఆత్మా! వినుము. శరీరము బయట జరుగు సంసారమునకు, లోపలగల సంసారము నకు మూడు గుణములే కారణము. సాత్త్విక, రాజస, తామసమనబడు మూడు గుణముల ప్రభావము అందరిలో నిండిపోయి మనుషులను మూడు విధములుగా విభజింప చేసినవి. త్రిగుణ రూపమైన జగత్తంతయూ మాయా సంసారమైపోయినది. మూడు గుణముల చేతనే శరీరము లోపలి ఇంద్రియములు పనిచేయగా బయట కార్యరూపమై చివరకు జీవుడు కర్మబద్ధుడగుచున్నాడు. మానవుడు జ్ఞానము తెలిసినవాడై ముల్లోకములుగా

చెప్పబడు మూడు గుణముల వలన వచ్చు కర్మలను అంటనపుడు త్రిగుణ సహిత సంసారమును విడచి సత్‌సారమైన ముక్తిని పొందగలడు. మూడు గుణములను జయించపోతే సంసారము దుసాధ్యమై పోవును.

**ఆ ॥ నాల్గు విధములుగను నరులకందరికి**
**బోధచేసినట్లు బుధజనములు**
**శాస్త్రరీతిగాను చాటిరి వినరేమో**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 80**

**భావము :-** జ్ఞానులయందును అజ్ఞానులయందును, మూర్ఖులయందును తెలివైనవారియందును, మంచివారియందును చెడువారియందును, అన్ని మతముల వారియందును ఒకే పద్ధతికల్గి ఒకే విధముగా రాగము (ప్రేమ) గానీ, ద్వేషముగానీ లేకుండా వర్తించు ఓ ఆత్మా! వినుము. భూమి మీద జ్ఞానులైనవారు అజ్ఞానులకు నాల్గు విధముల బోధ చేసి ముక్తులగునట్లు చేశారు. ప్రతి పనికి ఒక శాస్త్రపద్ధతి ఉండవలెనను సూత్రము ప్రకారము జ్ఞానము తెలిసి, దైవమును పొందుటకు నాల్గు విధానముల వరుస తెలియజేసారు. అవియే వరుసగా 1) భక్తి 2) జ్ఞాన 3) యోగ 4) ముక్తి అన్నారు. ఈ వరుస విధామును తెలియని వారు కొందరు కొంత భక్తి కల్గిన వెంటనే గురు ఉపదేశములు పొంది కొంత సాధన చేసి యోగులమను కొంటున్నారు. జ్ఞానము తెలియనిదే ఉపదేశము గానీ, యోగసాధన గానీ పనికిరాదని తెలియక జ్ఞానముతో పనే లేదు సాధన ఉంటే చాలంటున్నారు. **శాస్త్రపద్ధతిగా జ్ఞానము తెలియని సాధన గమ్యము తెలియని ప్రయాణము లాంటిదనీ తెలియకపోయారు.** భగవద్గీతలో భగవంతుడు చెప్పిన "శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్" అనుమాటను మరచిపోయి శాస్త్రవిరుద్ధముగా జ్ఞానము లేని సాధన చేయుచున్నారు. ఆ విధముగా అశాస్త్రీయ పద్ధతిలో ఎంత

సాధన చేసినప్పటికీ చివరికి అది యోగము కాదు, దాని వలన ముక్తి లభించదు.

**ఆ ॥ మూడు తనువులకు మూడవస్తలకును**
**ముఖ్యమైన సాక్షి మూర్తియేదో**
**గానలేని యోగి ఘనుడెట్టులాయెరా**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 81**

**భావము :-** పురుషాకృతియైన ఈశ్వర లింగము మీద ముగ్గురు పురుషుల గుర్తుగాయున్న మూడు విభూతి రేఖలలో మధ్యరేఖగా గుర్తింపబడియున్న ఓ ఆత్మా! వినుము. మన శరీరము స్థూలముగా పైకి కనిపిస్తున్నప్పటికీ మొత్తము మూడు భాగములుగా నున్నదని కొందరు చెప్పుచున్నారు. అవియే వరుసగా **1) స్థూల శరీరము 2) సూక్ష్మ శరీరము 3) కారణ శరీరము** అంటున్నారు. స్థూల శరీరము ఐదు జ్ఞానేంద్రియములు ఐదు కర్మేంద్రియములుగా పైకి కనిపించునదిగా ఉన్నది. సూక్ష్మశరీరము జీవుడు, బుద్ధి, చిత్తము, అహము, మనస్సు అనబడు ఐదు భాగములు. వ్యాన, ఉదాన, సమాన, ప్రాణ, అపాణ అను ఐదు వాయువులు. చూపు, వినికిడి, వాసన, రుచి, స్పర్శ అను ఐదు ఇంద్రియ విషయములుగను మొత్తము పదిహేను భాగములుగా ఉన్నది. కారణ శరీరమనగా జన్మలకు కారణమయిన పాప పుణ్యములనీ తెలియాలి.

శరీరములోని ఆత్మ శరీర మధ్యలోగల బ్రహ్మనాడిలో నివశిస్తూ శరీరమును కదలించి పని చేయించుచూ శరీరము చివరి అంచు వరకు వ్యాపించి ఉన్నది. కనుక ఎల్లవేళలా ఆత్మ స్థూల శరీరమునకు సాక్షిగా ఉన్నదని చెప్పవచ్చును. అదే విధముగా సూక్ష్మ శరీరములోని అన్ని భాగములకు శక్తినిచ్చి కదలించి పనిచేయించుట వలన ఆ శరీరమునకు

కూడా ఆత్మ సాక్షిభూతమై ఉన్నది. కర్మచక్రమునకు ఇరుసుగా నున్న బ్రహ్మనాడిలో ఆత్మ నివాసమై ప్రతి కర్మను చూస్తూ స్థూల సూక్ష్మ రెండు శరీరముల ద్వార అనుభవింపచేయుట వలన మూడవవదయిన కారణ శరీరమునకు కూడా ఆత్మ సాక్షిగానున్నదని చెప్పవచ్చును. ఈ విధముగా మూడు శరీరములకు ఆత్మ సాక్షిగా ఉండడమే కాక నిద్ర మెలుకువ స్వప్నములనబడు మూడు అవస్థలందు కూడా ఆత్మ సాక్షిగానున్నదనీ చెప్పవచ్చును. ఆత్మ జాగ్రత్తావస్థలో మనస్సుకు చైతన్యము నిచ్చుట వలన అప్పుడు కూడా సాక్షిగనున్నదని చెప్పవచ్చును. అలాగే నిద్రపోయినపుడు మనస్సు లేకున్నను నిద్రలో ఆడు శ్వాసకు చైతన్యమునిచ్చుచూ మిగతా శరీరము లోపలి కార్యములకు కూడా శక్తి నిచ్చుటవలన అపుడు కూడా నిద్రకు సాక్షిగా ఆత్మ గలదని చెప్పవచ్చును. స్వప్నావస్థలో జరుగు స్వప్నము లందు మనస్సును పని చేయించుచూ అక్కడి విషయములు మనస్సు ద్వారా జీవుని అనుభమునకు తెస్తున్నది. కావున స్వప్నములో కూడా ఆత్మ సాక్షిగా నున్నదని తెలియుచున్నది. ఈ విధముగా మనలోగల మూడు శరీరములకు మూడు అవస్థలకు ఆత్మ సాక్షిగనున్నదని తెలియనివారు జ్ఞానులనిపించు కోలేరు తర్వాత యోగులు కాలేరు. జ్ఞాని కానివాడు యోగి కాడు, యోగి కానివాడు ముక్తి పొందలేడు.

ఆ॥ **అట్టి బ్రహ్మపథము పట్టుగా గన్నట్టి**
**పరమ యోగి చరిత భావమెల్ల**
**నరులకు శక్యమగునే పరికించి చూడంగ**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **82**

**భావము :-** శరీరములోనే దృష్టి నిల్పి నిన్ను తెలియవలెనని ప్రయత్నించు యోగులకు తెలియబడు ఓ రెండవ ఆత్మా! వినుము. భూమి మీద

మానవుల జీవితములో రెండే మార్గములు గలవు. అవి ఒకటి ప్రకృతి మార్గము, రెండవది పరమాత్మ మార్గము. నూటికి తొంబై తొమ్మిదిపాళ్ళ మనుషులు ప్రకృతి మార్గములో నడుస్తున్నారు. కేవలమొక్క భాగము మాత్రము దైవమార్గములో నడువవలెనని ప్రయత్నించుచున్నారు. అటువంటి వారిని కొన్ని వేల మందిని పరిగణలోనికి తీసుకొంటే వారిలో ఎవడో ఒకడు అరుదుగా బ్రహ్మపథము అను దైవ మార్గములో పట్టుగల్గి ముందుకు పోవకల్గుచున్నాడు. బ్రహ్మపథములో పట్టుగల్గి యోగియైనవాడు తన స్థితి తనకు తెలిసినవాడై ప్రపంచములో జీవితమును సాగించుచుండును. అటువంటివాని ప్రవర్తన అజ్ఞాన నరులకు ఏమాత్రము అర్థము కాదు. అటువంటి సంపూర్ణ యోగి భావమందు వేరు భావము కల్గి ఉండును. భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఒక ముఖ్యమైన ధర్మము తెలుపడమే కాక ఆచరించి చూపించాడు. ఆయన సవ్యమైన, అపసవ్యమైన పనులు చేసి యోగులకు నేను మార్గదర్శకుడనని తెలియజేశాడు. పనులు చేస్తున్న నాకు ఏ కర్మలు అంటవు. నా మాదిరి కర్మరీత్య కార్యములు చేయుచూ **"తామరాకుకు నీరంటనట్లుండడము"** యోగుల యొక్క లక్ష్యమన్నారు. ప్రారబ్దకర్మ మన ఇచ్చ ప్రకారముండదు. మనమే కర్మ ఆధీనములో ఉండి దాని ప్రకారము నడువవలసి యుండును. అందువలన కర్మ ఆచరణలో మంచి పనులు రావచ్చును, లేక చెడు కార్యములు రావచ్చును. అటువంటపుడు ఒక దానిని చేయడము మరియొక దానిని మానుకోవడము తగదు. కర్మ దాని ఇష్ట ప్రకారము అది ఆడిస్తూ పోవుచుండును. కర్మ ఆధీనులమై చేసెడి కార్యములలో లోపలి భావమందు మార్పు కలిగి అహమును లేకుండా చేసుకోవలెను. అట్లు చేయుట వలన పనులలోని పాపపుణ్యములు అంటవు. ఈ సూత్రమును అనుసరించి యుద్ధము చేయుము పాపము రాదని కృష్ణుడు అర్జుననకు చెప్పాడు. నిజమైన యోగి లోపల భావమందు మార్పు

కల్గి చేసెడి పనులలో పై కార్యములే కనిపించును కానీ లోపలి భావము కనిపించదు. జ్ఞానము తెలియని వారికి పై చూపే ఉండును, కావున యోగుల భావము తెలియదని ఈ పద్యములో తెలియజేసారు.

**ఆ॥ బాలమత్తరీతి బలుపిశాచము భాతి**
**భావమందు భేద భావమిడచి**
**దిరుగుచుందురయ్య గురువులు ధరలోన**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 83**

**భావము :-** పూలమాలకు ఆధారమైన దారమువలె శరీరమునకు ఆధారమైయున్న ఓ ఆత్మా! వినుము. చిన్న వయస్సులోని పిల్లలు మంచి చెడు పనులు జేసియు నేనుయను అహము పొందకుందురు. లాభనష్టము లకు చింతించకుందురు. వారికి మంచి, చెడు, లాభనష్టములనెడి బేధ ముండదు. అట్లే గురువులకు కూడా భేద భావము లేకయుందురు. ఇంకను పెద్ద పిశాచి ఆవహించినవాడు ఏమీ తెలియని స్థితిలో నిలిచి పోయినట్లు, పిశాచి ఆవహించిన సమయములో చేసిన పనిని తాను ఏమాత్రము చేయలేదను భావము కల్గియున్నట్లు, యోగులకు కూడా తాను శరీరముకంటే వేరని శరీరములో జరిగిన పనులకు తాను కర్త కాదను భావముతో యుండును.

**విశేషార్థము :-** చిన్న వయస్సులోని వారికి వారి అంతఃకరణములు కూడా చిన్నవిగనే ఉండును. జీవుడు ఎప్పటికీ ఒకే విధముగానున్నను, మరణములో పాత అంతఃకరణములు పోయి జన్మలో క్రొత్తవి వచ్చుచున్నవి. క్రొత్తవి కూడా శరీరముతో పాటే పెరుగుచుండును. చిన్న వయస్సులోనివారికి అహంకారము కూడా చిన్నదిగనే యుండును. చిన్న వయసులో జరిగిన పనులకు అహంకారము నేనను భావమును జీవునికి బోధించు శక్తి లేకున్నది.

ఆ కాలములో జరిగిన పనులకు జీవుడు నేను చేసానను భావము లేనివాడై యుండును. అందువలన చిన్న వయస్సులోని వారికి ఏ కర్మ రాదు. కావున గురువులను చిన్న పిల్లలుగా పోల్చి చెప్పడమైనది.

పిశాచము పట్టినవాడు ఆ సమయములోజేసిన పనులను జ్ఞప్తికి వచ్చిన తర్వాత జూచి పిశాచము వేరని, తాను వేరని జరిగిన పనులు పిశాచమే జేసినది, నేను జేయలేదనుకొన్నట్లు గురువులు శరీరము వేరని, తాము వేరని అనుకొందురు. శరీరముతో జరిగిన పనులను జూచి 24 భాగములుగయున్న శరీరమే ఆ పనులకు కర్తయని నేను ఏ పనినీ జేయలేదనుకొనును. అందువలన గురువులు ఏ కార్యములు ఆచరించిన కర్మభేదము వదిలి ఉందురు.

**ఆ॥ ఘట జలంబులందు గగనఛాయ యున్నట్టు**
**కుటిల జగముతోడ గూడియున్న**
**అతి విలక్షనార్థస్థితిని జరించును**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 84**

**భావము :-** సకల శరీరములందు మూడవస్థలలో చైతన్యమునిచ్చు ఓ ఆత్మా! వినుము. పైనయున్న విశాల ఆకాశము కుండనీటిలో ప్రతిబింబించి కనిపించురీతిగా, ఆత్మయందు కూడియున్న గురువులు కూడా మూర్ఖపు మనుష్యులలో యున్నట్లే కనిపించుదురు. కుండలోని ఆకాశము కంటికి కనిపించినను నిజముగా అది కుండలో లేనట్లు మూర్ఖుల మధ్యలో యోగులు కనిపించినను నిజముగా వారు వేరు భావముతో ఉందురు.

**విశేషార్థము :-** పైకి తలెత్తి చూడలేనివానికి కుండ నీటియందు ఆకాశము మరియు మేఘములెన్నియో కనిపించినపుడు వాడు చూస్తున్నది ఆకాశము మేఘములను మాట నిజమే. ఎందుకనగా వాడు నిజముగా కంటితో

చూడగల్గుతున్నాడు. ఆకాశ మేఘమనగా వర్షము కురియు స్వభావము కలది. కానీ కంటికి కనిపించు కుండలోని మేఘము వర్షము కురియు స్వభావము లేనిది. అట్లే మామూలు మనిషిగా మూర్ఖులు జేయు పనులనే గురువులు చేయుచున్నప్పటికి, కనిపించుదానిని బట్టి గురువులను కూడా మూర్ఖులుగనే లెక్కించినను వారు కర్మలనుభవించు స్వభావము లేనివారై ఉందురు. కర్మమును భస్మీపటలముజేయు స్వభావము కలవారై యుందురు. వర్షము కురిసిన మేఘమును మేఘమనీ, కర్మల కాల్చువారిని గురువులనీ అనుభవపూర్వకముగా తెలియనగును. కానీ చూపుతో తెలియదగినది కాదు. ఎండమావులందు నీరున్నట్లే కంటికి తెలియును. కానీ నిజముగా అక్కడికి పోయి చూచిన నీరుండదు. ప్రతి మానవుడు సత్యాన్వేషణజేసినపుడు సత్యము తెలియును. పైకి కనిపించునది సత్యము కాదు.

ఘటజలంబులందు కనిపించు ఆకాశము చేతికి దొరకదు. చేతి తాకిడికి కనిపించక పోవును. అట్లే గురువులు అజ్ఞానుల మాదిరే వర్తించు చున్నప్పటికీ కర్మ వారిని బంధించలేదు. కర్మ తాకిడికి వారు దొరకరు.

**ఆ॥ ధ్వంస కవులు ధరను దండెత్తి యున్నారు**
**బుధుల పైన యుద్ధ బుద్ధి బూని**
**ఓర్వలేని భేద వాద యుద్ధమునకు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 85**

**భావము :-** పాపము చేయునపుడు, పుణ్యము చేయునపుడు ఒకే విధముగా శరీరమునకు శక్తినిచ్చి ఏ కర్మ అంటకుండా ఉండు ఓ ఆత్మా! వినుము. ప్రపంచములో కవులు ఉన్నారు మరియు జ్ఞానులు ఉన్నారు. కవులు ఊహాజనితములైన ఎన్ని వ్రాతలైనా వ్రాయగలరు మరియు చెప్పగలరు. కవుల మాటలలో వ్రాతలలో మాట పొందింపు వ్రాతల సొంపు ఉండును.

జ్ఞానులైనవారు ఏ విషయమును ఊహలతో చెప్పరు. జ్ఞానులు చెప్పు మాటలకు శాస్త్రబద్ధత ఉండును. కవులు కవిత్వమునుపయోగించుచూ జ్ఞానుల రూపములో ఉండవచ్చును గానీ జ్ఞానులు మాత్రము కవిత్వమునుప యోగించు కవులుగా ఉండలేరు. కవుల వద్ద లేని జ్ఞానశక్తి జ్ఞానుల వద్ద యుండవచ్చును. అందువలన జ్ఞానుల మాటలను, వ్రాతలను కవులు భాషా దోషమనో, ఉచ్చాటన దోషమనో తప్పులు పట్టుచుందురు. ముఖ్య విషయ మేమనగా జ్ఞానులు భాషాపండితులు కారు, కాబట్టి వారి మాటలలోనూ, వ్రాతలలోనూ చిన్నచిన్న తప్పులుండవచ్చును. వాటిని వదిలి భావమునే ముఖ్యముగా చూడవలెను. భావమును చూడక ఓర్వలేని బుద్ధి కల్గి జ్ఞానులతో వాద భేదమాడుచు యుద్ధ బుద్ధి కల్గియుందురు. అటువంటి వారికి జ్ఞానము ఎప్పటికీ కలుగదు. కవులు ఎప్పటికీ జ్ఞానులతో భాష యందు పోటీపడకూడదు భావము తెలుసుకొని బాగుపడవలెను.

**ఆ॥ భూసమాధి కొరకు భువిలోను జనులెల్ల**
**బుద్ధి యందు ఆశబూని వారు**
**బుధుల కికను దిక్కు బుట్టదుగాబోలు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 86**

**భావము :-** భువిలో ఎన్ని జీవరాసులున్నాయో అన్నిటిలోనూ అన్ని ఆత్మలుగా విభజింపబడి, పరమాత్మ ప్రతినిధిగా ప్రకృతిలో కలసి శరీరములో పని చేయుచున్న ఓ ఆత్మా! వినుము. బ్రతికియుండగనే సమాధి అని భూమిలో పూడ్చి పెట్టించుకొని పేరు తెచ్చుకోవలెనని కొందరు యత్నించు చుందురు. మరికొందరు చనిపోయిన తరువాత సమాధి కట్టించుకొని పూజలు చేయించుకోవలెనని ఆశపడువారు గలరు. సమాధి అనగా ఏమిటో అర్థము తెలియనివారు, సమాధి యొక్క విలువ తెలియనివారు ఈ విధముగా

ఆశ పెట్టుకొంటే దానికి పవిత్రత ఏమి ఉండును. జ్ఞానులయి యోగమాచరించి యోగశక్తి పొందిన వారికి కేటాయించబడిన సమాధుల మీద అజ్ఞానులు ఆశ పెంచుకొన్నారు. అందరూ సమాధియైతే జ్ఞానము తెలిసిన యోగులకేమి ప్రత్యేకత ఉండును. అజ్ఞానులు సమాధి చేయించుకోవడము మంచిది కాదు.

**ఆ॥ తగదు భూసమాధి తత్వ జ్ఞానము లేని**
**నరులు కోరి రేని నరకమగును**
**బుధుల కొరకదియు పూజ్యత కల్గియుండె**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 87**

**భావము :-** ఏ విషయముతో సంబంధము లేకుండా శరీరములోని కర్మ ప్రకారము శరీరమును నడిపించు ఓ ఆత్మా! వినుము. ఏ మాత్రము ఆత్మ జ్ఞానము తెలియనివారు భూసమాధి కావలెనని అదియు జీవ సమాధి కావలెనని కోరుకుంటే వారికి అది నరకమేయగును. భూసమాధి తత్త్వ జ్ఞానము తెలిసి బ్రహ్మయోగము పొంది శరీరముతో ఏ పనీ లేకుండా యోగములో నిలిచి పోవు వారికి అది అవసరము. సమాధి అనగా బుద్ధికి సమముగా తెలియునది ఆత్మని అర్థము. బ్రహ్మయోగములో మాత్రము మనస్సు నిలిచిపోవుట వలన బుద్ధికి ఏ విషయము తెలియక దానికి సమాంతరములో ఎదురుగానున్న ఆత్మయే తెలియును. ఆ స్థితినే సమాధి అని కూడా అందురు. బ్రహ్మయోగములో బుద్ధి వలన జీవాత్మ ఆత్మను అనుభవిస్తున్నది కావున దానిని జీవసమాధి అని అందురు. జీవుడు తనకు సమముగా ఆత్మను అనుభవించడము జీవసమాధి అనవచ్చును. ఇదేదో కొత్త నిర్వచనమనుకోవద్దండి. ఏనుగు బ్రతికినా వెయ్యి రూపాయలే, చచ్చినా వెయ్యి రూపాయలే అన్నట్లు **బ్రహ్మయోగి బ్రతికినా సమాధి పొందినవాడే చచ్చిన సమాధి పొందినవాడే.** ఆ గుర్తింపు కొరకు యోగులను భూసమాధి

చేసి చూపించవలసియున్నది. ఈ విషయము తెలియని అజ్ఞానులు కొందరు ప్రజలలో కొంత గుర్తింపు పొందినంతమాత్రముననే భూసమాధి కావాలను కోవడము మంచిది కాదు. జీవ సమాధి కావలెనని, వారి గుంత వారే తవ్వించుకొని అందులో కూర్చొని మూయించుకొని పూజలు పొందవలెనను కోవడము పొరపాటు. అలా కూర్చుంటే పైన మూసివేసిన తర్వాత ఐదు నిమిషములకు ప్రాణవాయువు అందక, ఊపిరాడక నరకయాతనపడి ఇరువది నిమిషముల లోపల చనిపోవుదురు. బయటగానీ, లోపలగానీ శ్వాస మీద ధ్యాసలేని శ్వాసతో పనిలేని బ్రహ్మయోగులే భూసమాధికి అర్హులు.

**ఆ॥** **ఆత్మ జ్ఞానమనెడి అగ్నిచేత కాలిన**
**తత్వవేత్త తనువు తప్పకుండ**
**భూసమాధి చేసి పూజింపవలె నరులు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **88**

**భావము :-** శరీరములోని బ్రహ్మనాడి యొక్క ఏడు ద్వారముల ద్వారా మరియు గ్రంథుల యొక్క ఏడు ద్వారముల ద్వారా శరీరమును పాలించు ఓ ఆత్మా! వినుము. యోగము చేసి, జ్ఞానాగ్నిని సంపాదించి ఆ జ్ఞానాగ్నిచే శరీరములోని కర్మలను కాల్చివేసిన తత్త్వవేత్త (యోగి) మరణించిన తర్వాత ఆయన శరీరమును భూస్థాపితము చేసి మానవులు పూజింపవలయును.

**విశేషార్థము :-** యోగులు జ్ఞానాగ్ని సంపన్నులయి ఉందురు. అటువంటి యోగులు బ్రతికి ఉన్నపుడు వారి నుండి జ్ఞానాగ్ని కిరణములు బయటికి వచ్చుచుండును. గొప్ప యోగులయిన యెడల వారి నుండియే కాక, వారి యొక్క చిత్రపటముల నుండి కూడా శక్తి కిరణములు వచ్చుచుండును. అటువంటివారు మరణించిన వెంటనే వారి పటము నుండి కిరణములు

వచ్చుట నిలిచి పోవును. ఇంకనూ గొప్ప యోగులైన యెడల వారి మరణా నంతరము వారి పటము నుండి, వారి శరీరమును స్థాపితము చేసిన స్థలము నుండి కిరణములు కొంత కాలము వరకు వచ్చుచుండును. యోగుల గొప్ప తనమును బట్టి చనిపోయిన తరువాత కిరణములు వచ్చు కాలముండును. మన చరిత్రలో 100 సంవత్సరముల వరకు వారి సమాధుల నుండి శక్తి బయటికి వచ్చిన యోగులున్నారు.

ఆత్మజ్ఞానమనెడి అగ్ని సంపాదించిన యోగుల శరీరములను భూసమాధి చేసి పూజించుచుండిన అక్కడి నుండి ఆత్మ కిరణములు బయలుదేరి వచ్చుచుండును కాబట్టి పూజించువారి కర్మలు కూడా కాలిపోవును. ప్రత్యక్ష సాక్ష్యముగా దేశములో కొన్ని సమాధుల వద్ద కర్మల నివారణ ఇప్పటికీ జరుగుచున్నది.

**ఆ॥ నిద్రమాని వేసి నెగడి గూర్చుండిన**
**భద్రమనిరి మూఢ బద్ధ జనులు**
**నిద్రలోను యోగ నిద్రనుగనలేక**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 89**

**భావము :-** సమస్త జీవరాసుల బుద్ధికి సమానముగా అర్థమగు ఓ ఆత్మా! వినుము. నిద్రను జయించినవాడు యోగి అను మాట విని, దాని భావము పూర్తి అర్థముకాక, కొందరు నిద్రలోని యోగమును తెలుసుకొనక నిద్ర పోవుట మానివేసి మేము యోగులమనుచున్నారు.

**విశేషార్థము :-** యోగులు నిద్రను జయించిన వారు, నిద్రనే నిద్ర పుచ్చువారు యను మాటలు కొందరు విని నిద్ర పోకుండా మేలుకొనుటకు అలవాటు పడుచున్నారు. 12 గంటలు నిద్రపోవువాడు 6 గంటలు నిద్రపోయి, 6 గంటలు నిద్ర జయించినాడనుకొనుము. వానికి ఎప్పటికీ 6 గంటల నిద్ర

వచ్చును. 6 గంటల నిద్రరాదు. నిద్రరాకుండా అలవాటు చేసుకొన్న సమయములో నిద్రరావలయునని ప్రయత్నము చేసిననూ అలవాటు ప్రకారము నిద్రరాదు. తన నిద్ర తనయిష్ట ప్రకారము రాకున్నపుడు నిద్ర తనమాట ఎట్లు వినినట్లగును. అట్టివానికి నిద్ర తనవశము కాలేదని, నిద్రను వాడు జయించలేదని చెప్పవచ్చును. నిద్రను జయించడమనగా నిద్రను మానివేయడముగాదు. నిద్ర పోయినప్పటికీ ఎరుక కల్గియుండడమని అర్థము, నిద్రయనగా మనస్సును మరపించునది. నిదురించువేళ మనస్సు మరపుకు పోకుండా జాగ్రత్తగా యుండడమే (యోగము) నిద్రను జయించడము. శరీరము నిద్రపోయినప్పటికీ మనస్సు ఎరుకగా ఉండటమే యోగము. అందువలన పై పద్యమందు **"నిద్రలోను యోగనిద్రయని"** యోగమును సంభోదించారు.

**ఆ॥ నిద్రమానరాదు నిద్ర పూనగరాదు**
**నిద్రలోను యోగ నిద్ర తెలిసి**
**ముద్రలోను బ్రహ్మమూర్తిని చూడరా**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 90**

**భావము :-** అయమాత్మ బ్రహ్మమని సమస్త యోగుల చేత ఉచ్చరించబడు ఓ ఆత్మా! వినుము. నిద్రమానివేసి జాగ్రత్తావస్థలో ఉండకూడదు. మరియు నిద్రపోయినప్పటికీ నిద్రలోనే యోగ నిద్రగా ఉండవలయును. యోగనిద్ర స్థితిలోనే ఆత్మను చూడవలెను.

**విశేషార్థము :-** శరీరములోని 24 భాగములలో ముఖ్యమైనది మనస్సు. సూర్య చంద్ర నాడుల మీద సంచరించు మనస్సు, విషయములను జ్ఞప్తికి తెచ్చు మనస్సు, బాహ్యేంద్రియములకు అంతరేంద్రియములకు మధ్యవర్తిగా యున్న మనస్సు, సూర్య చంద్ర నాడుల మీదయుండి తనపని చేయు

స్థితినే జాగ్రత్తయనుచున్నాము. మనస్సు సూర్య చంద్ర నాడులను వదిలి బ్రహ్మనాడిలో తనకు తానుగా చేరిపోవడమే నిద్రయని అందుము. నిద్ర సమయములో మనసు తన సహజ శక్తి అయిన జ్ఞాపకశక్తిని కోల్పోయి విశ్రాంతిగా యుండును. అందువలన నిద్ర సమయములో ఏ విషయము తెలియక జీవుడు అంధకారములో ఉండును. మనస్సు బ్రహ్మనాడిని వదలి సూర్యచంద్ర నాడులను చేరినపుడు, బయటి ప్రపంచ విషయములు మరియు జ్ఞాపక శక్తిచే జరిగినవి జరుగబోవు విషయముల ఆలోచనలు జీవునికి తెలియజేయుచుండును. ఈ స్థితినే జాగ్రత్తావస్థయని అందురు. మనస్సు బ్రహ్మనాడిని చేరి అచట కూడా ఎరుక కలిగియుండి బ్రహ్మనాడిలోని ఆత్మను జీవునికి తెలియజేయడమే యోగము. అపుడు జీవుడు ఆత్మానుభవములో ఉండును. మనస్సు బ్రహ్మనాడిలో యుండియు ఎరుక కల్గియున్నది కావున ఆ స్థితిని నిద్రయనకూడదు. మనస్సు ఎరుకయుండి బ్రహ్మనాడిని చేరి యుండడము యోగ నిద్రయని అందురు. మనస్సు సూర్య చంద్రనాడులలో ఉండడము యోగము కాదు. కావున పై పద్యములో నిద్ర మానగరాదన్నారు. మనస్సు బ్రహ్మనాడిలో ఎరుక లేకుండా ఉండడము యోగము కాదు. కావున నిద్రపూనగరాదన్నారు. మనస్సు బ్రహ్మనాడిలో కూడ జ్ఞప్తి కలిగి యుండడమే యోగము. అందువలన నిద్రలోను యోగముద్ర తెలిసి అన్నారు. యోగనిద్రా సమయములోనే ఆత్మ తెలియును. కనుక "ముద్రలోను బ్రహ్మమూర్తిని చూడరా" అన్నారు

**ఆ॥ యోగముద్రగన్న యోగీంద్రుడతి గాఢ**
**నిద్రనున్న నేమి నిశ్చలుండు**
**నిద్రగాదు యదియె నిర్వికల్ప సమాధి**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 91**

**భావము :-** జాగ్రత్త, స్వప్న, నిద్రయనబడు మూడవస్థలకు సాక్షిగానున్న ఓ ఆత్మా! వినుము. యోగ నిద్రను తెలిసిన యోగి అతిగాఢ నిద్రలోయున్ననూ యోగములో మునిగియుండును. బయట చూచువారికి నిద్రయే కనిపించిన లోపల మనస్సు ఆత్మయందు ఎరుక కల్గియున్నది. కావున దానిని నిర్వికల్ప సమాధి యని చెప్పవచ్చును.

**ఆ॥ మాయ మబ్బు గ్రమ్మి పై చీకటై పోయె**
**చీకటందు జగము చిక్కి పోయె**
**యేమి తోచదాయె యెరుకకు మరుపాయె**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 92**

**భావము :-** మూడు ఆత్మలందు మధ్య ఆత్మవై సమస్త యోగులచే ఆరాధింపబడు ఓ ఆత్మా! వినుము. మూడు గుణముల ప్రభావము వలన తమలోని ఆత్మ ఏమాత్రము తెలియకున్నది. మూడు గుణముల ప్రభావమునందే జీవులందరూ చిక్కియున్నారు. గుణములందు చిక్కుకొన్న మొదటి ఆత్మయగు జీవాత్మకు రెండవదయిన ఆత్మ ఏమీ తెలియడము లేదు.

**విశేషార్థము :-** తామస, రాజస, సాత్వికమను మూడు గుణములనే "మాయ" అని పెద్దలు చెప్పచున్నారు. "గుణమయీా మమ మాయ" **గుణముల కూడికయే నా మాయ** అని గీతయందు దేవుడు కూడా అన్నాడు. ఆ గుణభాగములందు ఇమిడియున్న కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనెడి గుణములనే మాయ అనెడి మబ్బు (చీకటి)గా చెప్పినారు. మూడు గుణభాగములందే జగములోని జీవులందరూ చిక్కి ఉన్నారు. కావున చీకటందు జగము చిక్కిపోయేనని చెప్పారు. గుణములందు చిక్కిన జీవుడు ఆత్మను తెలుసుకోలేకున్నాడు. కావున ఏమి తోచదాయె అన్నారు. జ్ఞాపకశక్తి అయిన మనస్సు బ్రహ్మనాడిలో నిద్రావస్థగా యున్నపుడు జ్ఞాపకశక్తిని కోల్పోవుచున్నది. అందువలన ఎరుక మరుపాయె అని చెప్పారు.

**ఆ ॥ తాడు భుజగ భ్రాంతి దారుచోరభ్రాంతి**
**గగనమందు  కుసుమ గట్టిభ్రాంతి**
**గలిగినట్లు జగము గలుగుచు తొలుగును**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 93**

**భావము :–** శరీరములోని 25 భాగములకు అతీతముగా యుండి శరీర మంతటికీ శక్తినొసగు ఓ ఆత్మా! వినుము.  చీకటిలో తాడు పాముగా కనిపించినట్లు, దారి ప్రక్కనున్న పైకి కొట్టి వేయబడిన చెట్టు మొదలు మొద్దు దొంగలాగా కనిపించునట్లు,  ఆకాశములోని పొగరూపమైన మేఘము గట్టిగా (ఘనపదార్థము) కనిపించినట్లు, జీవుడు యోగము పొందని సమయములో ఆత్మను తెలియని కాలములో, జగమును అర్థము చేసుకొన లేక జీవుడే శరీరముగా యున్నాడనుకొనును.  ఆత్మను తెలిసిన తర్వాత జగము యొక్క నిజ స్వభావము తెలిసినవాడై జీవుడు చైతన్యములేని వాడని, అన్నిటికీ ఆత్మయే చైతన్యమైయున్నదని తెలుసుకొనును.

**ఆ ॥ వట్టి సంశయంబు వచ్చింది వచ్చింది**
**మొట్ట మొదట లేని మూర్ఖతనము**
**పట్టి చూడ పోతే పసలేకపోయెరా**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 94**

**భావము :–** పరమాత్మకంటే తక్కువ వాడై, జీవాత్మకంటే ఎక్కువ వాడైయున్న ఓ ఆత్మా! వినుము. ప్రకృతి పరమాత్మ రెండూ గలవని ముందే తెలుసు కొన్నాము. ప్రకృతి పరమాత్మచేత సృష్టించబడినదే గానీ స్వయముగా పుట్టినది కాదు.  ప్రకృతి పరమాత్మను ఆధారముగా ఇరుసుగా చేసుకొని తిరుగుచున్నది గానీ అది స్వయముగా చలామణి కావడములేదు. ఇక్కడ విచిత్రమేమంటే ప్రకృతి కనిపిస్తుంది,  వినిపిస్తుంది మరియు అన్ని ఇంద్రియములకు

గోచరమగుచున్నది. పరమాత్మ ఎవరికీ కనిపించునది, వినిపించునది కాదు మరియు ఇంద్రియాగోచరమైనది. పరమాత్మ శాశ్వతమైనది ప్రకృతి అశాశ్వతమైనది. ఉన్న సత్యమిది కాగా, భూమి మీద మనిషికి ఉన్నది లేనట్లు, లేనిది ఉన్నట్లు తెలియజొచ్చి పెద్ద సంశయము ఏర్పడినది. ఆ సంశయమే దేవుడున్నాడా అను ప్రశ్న. లేని ప్రకృతిని ఉన్నట్లు ఉన్న పరమాత్మను లేనట్లు తెలియడమే మానవుని మూర్ఖత్వమైనది. ఆదిలో అందరూ జ్ఞానులుగా ఉండెడివారు అపుడు సంశయము లేక నిజ జ్ఞానము తెలిసియుండెడివారు. కాలక్రమమున జ్ఞానము లేకుండాపోయి మొదట లేని మూర్ఖత్వము మనిషిలో ఏర్పడినది. చీకటిలో తాడును పాముగా ఊహించినట్లు, మాయ చీకటిలో ప్రకృతియే దైవముగా మనిషికి కనిపిస్తున్నది. భ్రమ చేత ప్రకృతిని ప్రాముఖ్యముగా పెట్టుకొని పరమాత్మను విస్మరించిన వారికి ఎంత కాలము గడచినా ప్రకృతి మార్గములో శాంతి దొరకదు. ప్రకృతికి ఆధారమైన పరమాత్మయే అసలయిన సారాంశము కలవాడని తెలియకున్నంతవరకు, ప్రకృతిని ఆరాధించుచున్నంత వరకు మాయ ప్రభావము విడువదు.

**ఆ ॥ మాయ ఎరుగ బట్టి మర్దించలేనట్టి**
**మానవులకు యోగమార్గములను**
**జెప్పినాను యిందు చిత్రంబుగా ముందు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 95**

**భావము :-** ఇంటిలో విద్యుశ్చక్తిలాగా శరీరములో చైతన్య శక్తియైయున్న ఓ ఆత్మా! వినుము. **మాయ** అను పదమును అందరమూ వినియే ఉందుము. నీవు మాయలో పడినావు అంటున్నారు. మాయ అంటే ఏమిటి? మాయ ఎక్కడున్నది? మాయలో ఎక్కడ పడుచున్నాము? అని ప్రశ్నించుకొని చూస్తే

మాయ అనగా గుణముల సమూహమే అని తెలియుచున్నది. గుణము లయిన మాయ మన తలలోనే ఉన్నది. గుణముల మధ్యలో ఎల్లపుడూ జీవుడుండుట వలన మాయలో ప్రత్యేకించి పడడము ఏమీ లేదు, ప్రతి మనిషి తన తల లోపలే మాయలో పడి ఉన్నాడనియే చెప్పవచ్చును. జన్మించినప్పటినుండి తలలోని మాయలో మునిగియున్న మానవులకు మరియు గుణరూపములోనున్న మాయను కొంతమాత్రమైనా తెలుసుకోలేని మానవులకు, మాయను జయించలేకపోవుచున్న మనుషులకు, ఎంతో చిత్రముగా యోగమార్గములు అర్థమగులాగున తెల్పినాను. యోగ మార్గమర్థ మయి, మాయను జయించుటకు వీలుగా బోధించాము.

**ఆ ॥ చిత్త శుద్ధి లేని చీకాకు మతులకు**
**భక్తి యోగ జ్ఞాన భావమెల్ల**
**జెప్పవలెను యిట్లు చెప్పక తీరదు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **96**

**భావము :-** యోగులందును భోగులందును సమాన వృత్తి కల్గియున్న ఓ ఆత్మా! వినుము. ఎల్లపుడూ మాయ గుణములందు చిక్కి ప్రపంచ పనులయందే లగ్నమై వాటిలో ఏమాత్రము తృప్తిలేక, చిత్త శుద్ధి లేక చీకాకు మతితో జీవితము సాగించు అజ్ఞాన ప్రజలకు వారు మాయ నుండి కడతేరునట్లు భక్తి, జ్ఞాన యోగములను బోధించవలెను. మనిషి మాయ నుండి బయటపడుటకు కావలసిన ముఖ్యపరికరములు భక్తి, జ్ఞాన యోగములు. భక్తి అనగా ఎన్నో విధముల గలదు. ప్రకృతి మీద గల భక్తిని, దేవతల మీద భక్తిని కాక, దేవ దేవుడైన పరమాత్మ మీద భక్తిని ఏర్పరచవలెను. తర్వాత పరమాత్మ జ్ఞానమే తెలుపవలసి యుండును. భక్తి జ్ఞానములలో పరిపక్వుడైనవానికి యోగమును గూర్చి చెప్పవలసి

ఉండును. ఈ వరుస క్రమము కాక భక్తిరాకనే జ్ఞానము బోధించినా ప్రయోజనము లేదు. అలాగే జ్ఞానము తెలియకనే యోగమును బోధించినా ప్రయోజనము లేదు. అందువలన అజ్ఞానులను జ్ఞాన పథముల నడిపించ వలెననుకొన్నపుడు మొదట దేవతల దేవుడైన పరమాత్మ విషయము కొంత తెల్పి, ఆయన మీద భక్తి పుట్టునట్లు చేయవలెను. ప్రాథమికముగా భక్తిని ఏర్పరచడములోనే కొంత కష్టముండును. ఎందుకనగా ముందే ప్రతి మనిషి ఏదో కొంత భక్తి కల్గి ఆ భక్తిని దేవతల మీదనో, ప్రకృతి శక్తుల మీదనో చూపుచుందురు. భక్తి కోర్కెల నిమిత్తమేనని వారి హృదయములలో నాటుకొని పోయి ఉండును. అటువంటి భక్తిని లేకుండా చేసి పరమాత్మ మీద భక్తి కలుగజేయడము చాలా కష్టము. ఒకవేళ అసలయిన భక్తి కల్గిన తర్వాత జ్ఞానము లేకనే యోగము చేస్తామను వారు చాలామంది ఉందురు. అది కూడా మంచిది కాదనీ, మొదట తెలియవలసినది జ్ఞానమనీ పూర్తిగా జ్ఞానమును తెల్సిన తర్వాత యోగమాచరించునట్లు చేయవలెను. ఈ పద్ధతి ప్రకారమైతే అజ్ఞానులు కూడా ముక్తి పొందవచ్చును.

**ఆ ॥ రాతినేల చెట్టు రసహీనమైనట్లు**
**కఠిన చిత్తముండు కారులకును**
**అచల బోధ తగుదు ఆర్యులు చెప్పరు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 97**

**భావము :-** శరీరములో అణువణువునా వ్యాపించి శరీరాంతర్గత పనులకు కారణశక్తియైయున్న ఓ ఆత్మా! వినుము. రాతినేల వర్షపు నీరింకదు, తేమ ఉండదు. అటువంటి నేలలో విత్తనము వేసినా అది మొలకెత్తదు. ఒక వేళ మొలకెత్తినా దానికి తేమ దొరకక, బలహీనమై చివరకు ఎండిపోవును. మొదటిదయిన భక్తి భావము లేని కఠినాత్ములకు, ఎప్పుడు

విమర్శనాదృష్ఠితో చూచు అవిశ్వాసులకు పరమాత్మ బోధ ఒంట బట్టదు. అటువంటి వారికి దైవజ్ఞానము చెప్పినా దానిని అర్థము చేసుకోక విపరీతార్థ భావముతో చూచుకొనుచూ చెప్పెడివారినే హేళనగా మాట్లాడజొచ్చుదురు. అందువలన గురువులయినవారు అటువంటి రాతినేలతో సమానమైన మూర్ఖులకు నిర్వికారమైన అచేల బోధ చెప్పరు.

**ఆ ॥ పుచ్చు విత్తనము భూమిలో వేసినా**
**జచ్చు గాని మొలకసాగ దెందు**
**కుచ్ఛితాత్మలకు కుదరదు తత్వంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 98**

**భావము :-** అండజ, పిండజ, ఉద్భిజములైన మూడు రకముల జీవరాసులలో ఏ జీవరాసియందైనాగానీ ఒకే సిద్ధాంతము, ఒకే నిర్ణయముగా ఒకే పద్ధతిగా పనిచేయు ఓ ఆత్మా! వినుము. విత్తనము వేయబడు నేల సారములేనిది గానీ, రాతినేల గానీ, తేమలేనిది గానీ ఐతే వేయబడిన మంచి విత్తనము కూడా వృథా అగును. అలాగే బోధను గ్రహించలేని మూర్ఖునికి ఎంత మంచి బోధ చెప్పినా అది వ్యర్థమే అగును. ఒకవేళ భూమి మంచి సారవంతముండి తేమగలదైన అందులో మంచి విత్తనము పడక పుచ్చిన విత్తనము పడితే అది మొలకెత్తలేదు. అలాగే బోధను తెలియువాడు మంచి భక్తి విశ్వాసములుండి, గ్రహించుకొను శక్తి గల్గి యుండినప్పటికీ బోధను చెప్పు బోధకుడు సరియైన బోధ చెప్పలేకపోతే ఆ బోధ వానిని ముక్తి మార్గమున నడిపించనూ లేదు. అందువలన బోధ చెప్పించుకొనువాడు గానీ, బోధను చెప్పువాడు గానీ ఇద్దరూ సక్రమముగా ఉన్నపుడే భూమి, విత్తనము రెండూ బాగుండి పంట పండినట్లు మోక్షము లభించగలదు. అందువలన వినేవారందరూ శిష్యులు కారు, చెప్పే వారందరూ గురువులు కారని కొందరన్నారు.

**ఆ ॥ నిజము చెప్పనేని నిష్ఠూరమొచ్చును**
**చెప్పరాదు నిజము జగతి రొష్టు**
**అధిక పరమ రహస్యమచల సిద్దాంతంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 99**

**భావము :-** జీవాత్మ ఏ శరీరములో ప్రవేశించినా, దాని వెంట ఆ శరీరములో ప్రవేశించి, అక్కడ కర్మరీత్యా ఏమి జరుగవలెనో ఆ పనులను శరీరము ద్వారా చేయించు ఓ ఆత్మా! వినుము. ప్రపంచములో నిజమును తొందరగా అర్థము చేసుకొనువారు చాలా తక్కువ. వారికి అర్థము కానపుడు సత్యము చెప్పిన వానిని నిష్టూరముగా జూచెదరు. ప్రపంచవిషయములలో ఎట్లు చెప్పిన ఫరవాలేదు గానీ, జ్ఞానబోధలలో మాత్రము నిజమే చెప్పవలసి ఉన్నది. నిజము చెప్పితే అర్థము కానివారికి విరోధిగా, నిష్టూరముగా ఉండవలసినపని ఏర్పడును. అందువలన యదార్థమును అర్థము చేసుకొను స్థోమత గల మనుషులు దొరకు వరకు పరమ రహస్యమైన బట్ట బయలు (అచేల) సిద్ధాంతమును చెప్పరాదు.

**ఆ ॥ అచలమంటె కొందరతి కోపగింతురు**
**అందు పరమసందు యందలేక**
**అంధకార బంధురాత్ములై యుందురు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 100**

**భావము :-** శరీరములో పని నీవు చేసి, ఫలితమును జీవాత్మకు అందించే ఓ ఆత్మా! వినుము. ప్రపంచములోని మనుజులందరూ మాకు భక్తివున్నదని ఏదో ఒక పూజ చేయుచూ, తమ్ము తాము గొప్ప భక్తులుగా తలచుకొను చుందురు. ఏమాత్రము ఆత్మజ్ఞానము లేనివాడు ఉదయము స్నానము చేసి ముఖాన బొట్టుపెట్టుకొని, ఇంటిలో ఏదో ఒక దేవుని చిత్రము ముందర

అగర్‌బత్తి ముట్టించి, నమస్కరించి నాకెంతో భక్తి కలదనీ, నిత్యము పూజ చేయనిదే బయటికి పోననీ అనుకొనుచుండును. అటువంటివాడు గొప్ప బ్రహ్మజ్ఞానులను సహితము నిందించు స్వభావము కల్గియుండును. తాను మ్రొక్కుచున్నది దేవున్నో, దయ్యమునో తెలియనివాడు ఏకముగా బ్రహ్మ జ్ఞానము తెలిసిన శక్తివంతులను సహితము లెక్క చేయని స్థితిలో ఉండును. అటువంటి వారికి తాము చేయు పూజకంటే మిగతాదేది గొప్పగా ఉండదు. కనుక పరబ్రహ్మ స్వరూపము, పరిపూర్ణము, నిర్వికారము అయిన అచేలమును గురించి చెప్పితే దాని గొప్పతనము గానీ, వివరముగానీ, తెలియని అంధకార బంధురాత్ములైనవారు కోపగించుకొందురు. బట్ట బయలును గురించి తెలపాలనుకొంటే చెప్పేవారు వారికి బూటకపు మనుషులవలె కనిపింతురు.

**ఆ ॥ సాధనంబు చేత సాధ్యంబుగానిది**
**పట్టతరము గాని బట్టబయలు**
**పట్టినామటంచు బల్కిరి కొందరు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 101**

**భావము :-** శరీరములోని ప్రాణమునకు ఆధారమై ఆడించుచున్న ఓ ఆత్మా! వినుము. నీవు శరీరమును నడిపించు రెండవ ఆత్మవు. నీతో పాటు శరీరములో జీవాత్మ గలదు. జ్ఞానము గానీ, అజ్ఞానము గానీ రెండవ వాడయిన నీకు అవసరము లేదు. కావలసినదంతా జీవాత్మకే. జీవాత్మ రెండవవాడయిన ఆత్మ సహకారముతో మూడవవాడయిన పరమాత్మలోనికి చేరడమును ముక్తి అంటున్నాము. మూడవ పురుషుడయిన పరమాత్మలోనికి చేరినపుడే, అదేదో ఎట్లుండునో జీవుని అనుభవానికి వచ్చును. జీవుడు శరీరమును వదలి, ఎన్నో జన్మలనుండి వెంటవచ్చు ఆత్మను కూడా వదలి

పరమాత్మలోనికి చేరినపుడే పరమాత్మ ఏమిటో తెలియును. బ్రతికి ఉన్నపుడు ఎంత సాధన చేసినా అది రెండవ ఆత్మను తెలియుటకు మరియు తన కర్మను పోగొట్టుకొనుటకు ఉపయోగపడును గానీ, పరమాత్మ ఏమిటో తెలియదు. సాధన అంతయూ కర్మను లేకుండా చేసి ముక్తిమార్గము ఏర్పరచునదే కానీ, సాధన వలన పరమాత్మ తెలియదు. సాధనపరుడు తన సాధనలో ఉత్పన్నమగు జ్ఞానాగ్ని చేత కర్మనంతటినీ కాల్చివేసి, కర్మశేషము లేనివాడైనపుడు మరణము పొంది ఆ మరణము తర్వాత జన్మకు పోకుండా పరమాత్మయందైక్యమగును. అట్లు కర్మలేనివాడై మరణము పొందితే, అపుడు దేవుడెవడో తెలియును. అంతవరకు సజీవముగానున్న వానికి ఎంత యోగియైనా, ఎంత సాధకుడైనా ఏ పద్ధతి అనుసరించినా, చివరకు బ్రహ్మర్షి అయినా, పరమాత్మ ఎటువంటిదో ఎవరికీ తెలియదు. సాధనంబు చేత సాధ్యపడని బయలయిన పరమాత్మను తెలిసినామని కొందరనుట హాస్యాస్పదముగా ఉండును. బ్రతికియుండి మేము దేవున్ని తెలిసినామంటే, వారి అజ్ఞానమును వారి అమాయకత్వమును చూచి దేవుడే నవ్వగలడు. సాధనముల చేత, బ్రహ్మయోగము చేత శరీరములోని ఆత్మ జీవాత్మకు తెలియగలదు. అంతేగానీ సజీవముగానున్న జీవాత్మకు పరమాత్మను తెలుపు సాధనగానీ, పద్ధతిగానీ ఏదీ భూమి మీద లేదు.

**ఆ ॥ నామరూపు లేదు నానార్థములు గాదు**
**కామ లోభ మోహ కాంక్షగాదు**
**పంచ కళలు గాదు పంచాక్షరియు గాదు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 102**

**భావము :–** నేను పుట్టినప్పటి నుండి నాలో అన్ని పనులకు సాక్షిగా యుంటూ ప్రారబ్దమును నా చేత అనుభవింపజేయు ఓ ఆత్మా! వినుము. భూమి

మీద నాస్తికులు, ఆస్తికులు రెండు రకములు గలరు. ఒక విధముగా ఆస్తికులకంటే నాస్తికులే మేలేమో అనిపిస్తుంది. ఎందుకంటే ఆస్తికులు దేవుడెవరో తెలుసుకోలేక దయ్యాలను పూజిస్తున్నారు. వారు నిజ దైవమైన పరమాత్మ మార్గములోనికి వస్తారను నమ్మకము లేదు. నాస్తికులు ఎప్పటికయినా మారితే పరమాత్మ మార్గములోనికి రావచ్చునే నమ్మకమున్నది. నాస్తికులు, హేతువాదులు, శాస్త్రబద్ధమైన పరమాత్మను తప్ప చిన్న దేవతలను వారు విశ్వసించరు. ప్రజలు విశ్వసించు దేవతలందరూ దేవదేవుడు అయిన పరమాత్మకు సాటిరారు. మిగతా దేవతలందరూ పరమాత్మ సృష్ఠిలోని వారే. దేవుని చేత పుట్టించబడినది ఏదయినా రూపము పేరు కల్గియుండును. అంతేకాక దైవ సృష్ఠిలోని సజీవ ప్రజలలో గానీ, జంతువులలో గానీ కామ, క్రోధ, లోభ, మోహాది గుణములు కూడా తయారు చేయబడి ఉన్నవి. మానవులతో సహా ఎన్నో లెక్కలేనన్ని అనుసంధానముగా సృష్ఠించబడ్డాయి. సృష్ఠించిన వాడు వేరు సృష్ఠించబడిన వస్తువులు, పదార్థములు వేరు. కావున పై పద్యములో పరమాత్మను గురించి చెప్పుచూ దానికి నామము రూపము లేదు అన్నారు. దానికి ఇతర అర్థములు లేనే లేవు అన్నారు. సృష్ఠించబడిన గుణములు గానీ, కళలు గానీ పంచాక్షరి అయిన ఆత్మశక్తిగానీ కానే కాదన్నారు. అన్నిటికీ అతీతమైనది పరమాత్మ, పరమాత్మనునది పేరు కాదు. ఆత్మకంటే పరముగానున్నదనీ, ఆత్మ కూడా కాదని, పరముగానున్న దని పరమాత్మ అన్నారు. పేరు ఆకారము లేని దైవము ఇంకా ఎట్లున్నదో క్రింది పద్యములలో చూచెదము.

**ఆ ॥ ఆది లేదు దాని కాధారమెవ్వరో**
**నడుమ లేదు దాని నామమేమో**
**తుదయు లేదు మొదలు లేదు తుర్యంబు తాగాదు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 103**

**భావము :–** శరీరమనెడి రథమునకు సారథిగా యుండి, ఇంద్రియములనెడి గుఱ్ఱములను త్రోలుసారథియై, శరీర రథమును అధిష్ఠించి యున్న జీవునికి సుఖదుఃఖములనెడి అనేక ప్రదేశములను చూపుచున్న ఓ ఆత్మా! వినుము. పరమాత్మకంటే ముందేది లేదు. దానిని పుట్టించినది మరేది లేదు. అది అగమ్యగోచరమైనది దానిని స్వయంభు అని చెప్పే దానికి కూడా వీలు లేదు. ఎందుకనగా ఒకప్పుడు లేకుండా వుండి తర్వాత తనకు తానుగా పుట్టినది కూడా కాదు. దానికి పుట్టుకయే లేదు, మొదలు అని గానీ, మధ్య అని గానీ తుదయని గానీ ఏ స్వరూపము లేనిది. దానికి ఆధారము ఆది లేనిది తనకు తాను ఆధారమైనది. మనుషులకున్న నిద్ర, మెలుకువ, స్వప్నము కాక తురీయమను మూర్ఛలాంటి స్థితియు కాదు మరియు ఏ యోగమూ కాదు. ఏదీ కాని స్థితి అనిన ఆ స్థితియు కాదు, మాటలతో చెప్పుటకు భాషయే లేనిది, సమాచారమే కానిది మరియు సంచారము లేనిది ఇంకనూ ఎట్లున్నదనగా!

**ఆ ॥ గాఢ నిద్రయు గాదు ఘనజ్ఞప్తియు గాదు**
**ఊరుకొనుట గాదు ఊహగాదు**
**పగలు రేయిగాదు పరమాత్మ రూపంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 104**

**భావము :–** చెట్టుకు తాట అనుబంధమై ఉన్నట్లు శరీరములోని జీవాత్మకు శక్తి రూపములో అనుబంధమైయున్న ఓ ఆత్మా! వినుము. మూడవ ఆత్మయైన పరమాత్మను నిద్రతో పోల్చి చూచితే గాఢ నిద్రయు గాదు, మెలుకువతో పోల్చి చూచితే ఘన జ్ఞప్తియు గాదు. ఏమీ చేయక ఊరకుండుటేమోనని ఊరకుండిన అదియూ కాదు. చేస్తే పనియు గాదు, మనస్సు కాదు, మనో ఊహ అనుకొనే దానికి ఊహయు గాదు. కాలమును కొలుచు పగలు రేయితో పోల్చి చూచినట్లయితే పగలు గాదు, రేయిగాదు పరమాత్మ

ఇటువంటిదని చెప్పుటకు ఏ దానికి పోలిక లేనిదై, ఎటువంటి నమూనాలకు ఊహలకు అందనిదై ఉన్నది. ఇంకా వివరముగా చూచినట్లయితే క్రింద పద్యము గమనించుము.

**ఆ ॥ ఆది విరాటుయు గాదు యానందమును గాదు**
**ఆత్మగాదు అంతరాత్మ గాదు**
**చింతనొందబోదు చిత్కళత్వము గాదు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 105**

**భావము :-** సంసారమను నాటకమునకు పరమాత్మ సూత్రధారి కాగా, నాటకమును వీక్షించుచు నాటకములోని భావములను అనుభవించు ప్రేక్షకుడు జీవుడు కాగా నాటకమును ఆడు ఓ ఆత్మా! వినుము. సృష్ఠికర్త అయిన దేవుడు ఎటువంటివాడో అని ఏ విధముగా విడదీసి చూచిన ఏదీగాని అగమ్యగోచరునిగా ఉన్నాడు. ఆది విరాటని కొందరనుచున్నారు ఆ మాట నిజమేమో అని చూచినా అదియు నిజము గాదు. ఆనంద స్వరూపుడని కొందరు వర్ణించారు ఆ మాట సత్యమా అని చూచిన అదియు నిజముగాదు. కొందరు అంతరాత్మయని ఆత్మయని అనేక విధములుగా చెప్పడము జరిగినది ఆ మాటలు నిజమేమో అని పరికించి చూచినట్లయితే అదియు నిజము కాదు. కొందరు చింతయని చిత్కళయని చెప్పారు, కానీ అందువాస్తవముందా? అనుకొంటే చింతయు గాదు, చిత్కళయు గాదు. పరమాత్మ ఉన్నదని చెప్పుటకు ఏ ప్రమాణము చూపలేము, అట్లే లేదు అని చెప్పడానికి కూడా ఆధారము చెప్పలేము. అది విరాటుగానీ, ఆనందము గానీ, ఆత్మగాని అంతరాత్మయిన జీవుడు గాని, మనోచింత గానీ మనోదృష్ఠి యొక్క చిత్కళయు గానీ పరమాత్మను గూర్చి చెప్పుటకు మన చేత ఏమాత్రము గాదు. మానవులమయిన మన చేత గాదు, మిగతా దేనిచేతగానీ ఎవరి చేత కూడా కాదనీ క్రింద చెప్పుచున్నారు.

**ఆ ॥ శ్రుతులు మూర్ఛనొందె చింతించి చింతించి**
**వెతలు చెందిరయ్య వేల్పులెల్ల**
**ఘన సనాతనాత్మ గానంగ లేకను**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 106**

**భావము :-** శరీరములో ఆత్మ చేస్తున్నప్పటికీ జీవాత్మ తాను చేసినట్లు తలచితే, ఆ పనిలోని కర్మను జీవునికి అంటకట్టు ఓ ఆత్మా! వినుము. పరమాత్మను తెలియుటకు మనుషులేకాక దేవతలు కూడా ప్రయత్నము చేసి, వారికి కూడా ఏమాత్రము అర్థముకాక వెతలు జెంది ఊరకున్నారు. శ్రుతులు కూడా దైవమును గురించి పరిశోధించి పరమాత్మ విషయములో ఏమీ తెలుపలేకపోయాయి. అందువలన పరమాత్మను తెలియుటకు శ్రుతులను ఆశ్రయించినా, దేవతలను ఆశ్రయించినా, ఏమి ప్రయోజనము లేదు. అన్నిటికీ అతీతమై ఎవరికీ తెలియని, ఏదీ కాని పరమాత్మను తెలిసినామని కొందరు బహిరంగముగా చెప్పుకొనుట నవ్వదగిన విషయమే కదా!

**ఆ ॥ తనువునందు పంచ తన్మాత్రలున్నట్టి**
**తలుపు లేదు సాక్షి తానుగాదు**
**తన్ను తాను గనదు తానేది గనబోదు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 107**

**భావము :-** శరీరములో ప్రారబ్ధ కర్మ ప్రకారము సుఖదుఃఖములందు ఆడింపబడుచూ, అహము పొందిన జీవాత్మ పాలిట చిత్రగుప్తుడవై ఆగామి కర్మను అంటగట్టు ఓ ఆత్మా! వినుము. పరమాత్మ మన శరీరమునందు కలదనుకొంటే శరీరము బయట కూడా ఉన్నది. పంచభూతములందున్న దనుకొంటే పంచభూతములు లేనిచోట కూడా కలదు. అన్నిటికీ సాక్షిగా ఉన్నదనుకొంటే దానికి అక్షియు లేదు. ఇతరులను చూడదు తన్నుతాను

చూచుకోదు. పరమాత్మకు తనువు లేదు మరియు తలపు లేదు, అదియొక పరికరము గాదు, దానికి పరిమితి లేదు, పరిమాణమున్న శక్తియు గాదు, ప్రపంచము లోపలున్నది గాదు. తాను అన్న భావము లేదు, తానేదో ఎవరికీ తెలియదు. పరమాత్మ అంచులు లేనిది, అంచనాలకు అందనిది. బ్రతికి యున్న మహర్షులకు గానీ, రాజర్షులకు గానీ, దేవర్షులకు గానీ, బ్రహ్మర్షులకు గానీ, బ్రహ్మయోగులకు గానీ, కర్మయోగులకు గానీ తెలియనిది. అందరి చేత ఉన్నదని చెప్పించుకొనునది పరమాత్మ.

**ఆ ॥ మూర్ఛనొందబోదు మూర్ఖుల కందదు**
**సాధనంబు కష్టసాధనంబు**
**పట్టు విడుపు లేని పరిపూర్ణ యోగంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 108**

**భావము :–** మంచి చెడు కర్మలను తారతమ్యము లేకుండా ఆచరించుచూ పాప పుణ్యములకు సంబంధము లేని ఓ ఆత్మా! వినుము. పరమాత్మ ఒక జీవమున్న పదార్థము గాదు కనుక అది మూర్ఛపోతుందని చెప్పుటకు అవకాశమే లేదు. తెలియుటకు సాధనము గాదు, కష్టసాధనము గాదు. పట్టు విడుపులేనిది, చేతికి దొరకనిది మరియు ఏ రుచిలేనిది. ఏమీ కాని పరమాత్మను ఏ మని చెప్పవలెనో ఎవరికీ అర్థముకాక ఆత్మకంటే వేరుగా యున్నదని పరమాత్మ అన్నారు. అలాగే పురుషులకంటే వేరయినదనీ మరియు ఉత్తమమైనదనీ పురుశోత్తముడన్నారు. కర్మనాశనమయిన తర్వాత జీవుడు జన్మలను పొందక, విడుదలగా పొందునది గాన ముక్తి, మోక్షము అన్నారు. పరమాత్మ అంటే ఏమిటో ఏమి కాదో క్రింద పద్యములో కూడా చూస్తాము.

ఆ ॥ **విష్ణు శివుడు గాదు వీర వైష్ణవము గాదు**
**బ్రహ్మనిష్ఠ గాదు భక్తి గాదు.**
**ప్రాణ రూపు గాదు ప్రజ్ఞానమదియ గాదు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **109**

**భావము :-** అజ్ఞానులలో ప్రారబ్దమును అనుభవింపజేయుచూ ఆగామి కర్మను అంటగట్టుచూ, జ్ఞానము తెలిసిన యోగులలో ప్రారబ్దమును అనుభవింపజేయుచూ, ఆగామికర్మను అంతము చేయుచున్న ఓ ఆత్మా! వినుము. దేవతలలో పెద్దవాడయిన విష్ణువుగాగానీ, శివునిగాగానీ, చెప్పుటకు ఒకరికి పుట్టినవాడు గాదు. పేరు కల్గినవాడు కాదు, విష్ణువు ఈశ్వరుల మాదిరి దేవుడు కాడు. ఒకప్పుడు అది అనియు మరియొకప్పుడు వాడు అనియు పిలువబడు పరమాత్మను పురుషుడని చెప్పలేము, స్త్రీ అని కూడా చెప్పలేము. భక్తియే పరమాత్మ అనుకొనేదానికి భక్తియు గాదు, భక్తి వలన ఏర్పడు బ్రహ్మనిష్ఠయు కాదని తెలిపారు. జ్ఞానమే దైవస్వరూపమని చెప్పుటకు వీలులేదు. జ్ఞానము గానీ, ప్రజ్ఞానము గానీ దేవుడు కాదనియే చెప్పవచ్చును. ఫలానాయని చెప్పుటకు ఏ దారీ లేని పరమాత్మను గూర్చి కొందరేమన్నారంటే.

ఆ ॥ **పరమ శివ కళలనుచు బల్కిరి కొందరు**
**ముక్తి కాంతయనుచు మ్రొక్కి కొంత**
**వెతకి కానలేక విసిగిరి కొందరు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **110**

**భావము :-** శరీరయంత్రాంగములో 24 భాగములను ఒక్క జీవుని కొరకు నడిపిస్తూ, పరమాత్మకు బంటుగా నిలిచిన ఓ ఆత్మా! వినుము. పరమాత్మ ఇది యని నిర్ణయించలేక ఎందరో ఎన్ని విధములుగనో చెప్పుకొన్నారు.

ఆ విధముగా చెప్పుకోవడములో పరమశివ కళయని కొందరు జ్ఞానులు చెప్పగా, మరికొందరు ముక్తి కాంతయని మ్రొక్కినారు. ఇంకా కొంతమంది దేవుని మీద ఎన్నో పరిశోధనలు చేసి చివరికి ఏమీ నిర్ణయము కాక విసిగి పోయారు. పరమాత్మ బ్రతికియున్న శరీరధారులకు తెలియడను సూత్రము తెలియక ఎందరు ఏ విధముగా చెప్పుకొనినా, అన్వేషించినా చివరకు చెప్పుకొన్న వారి మాటలు, అన్వేషించిన వారి అన్వేషణ వృథా అగుచున్నది.

**ఆ ॥ జపము తపము చేసి జడలు బిగించినా**
**జాడ తెలియరాదు జపితులకును**
**చూడనలవి గాదు సుఖదుఃఖమును గాదు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 111**

**భావము :-** శరీరములో నీవు ఏమి చేయుచున్నది ఎవరికీ తెలియనీయ కుండా నిద్రించు సమయములో కూడా శ్వాసను నడుపుచున్నావు. అటువంటి నీ ఉనికిని తెలియక అన్నీ నేనే చేయుచున్నానని జీవుడు భ్రమిస్తున్నప్పటికీ, ఏ పనినీ జీవునికి వదలక అన్ని పనులను ఎంతో ఓర్పుగా చేయుచున్న ఓ ఆత్మా! వినుము. భూమి మీద సజీవులైనవారు దేవున్ని తెలియాలని తలలోని వెంట్రుకలు జడలుగా మారినవాటిని ముడివేసి జపము తపము చేసి వయస్సంతా వెతకడములోనే ఖర్చు చేసి, చివరి వృద్ధాప్యములో కూడా పరమాత్మ జాడ తెలియక, ఆ మాట బయటికి చెప్పితే మిగతావారు విలువివ్వరని, మేము తపము చేసి దేవున్ని తెలుసుకొన్నా మని బొంకుచున్నారు. తాము అంత శ్రమపడినామనుటకు నిదర్శనము కొరకు తలకు బరువైన జడలను మాత్రము కత్తిరించక అలాగే మోయు చున్నారు. నాకు ప్రకాశవంతముగా కళ్లు చూడలేనంత కాంతిగా దేవుడు కనిపించాడని కొందరు, పరమాత్మను తాము తాకి వచ్చాము దూదికంటే మెత్తగా ఉన్నాడని కొందరు, మాకు ఆకాశములో తెల్లగా కనిపించాడని

కొందరు, తెలియని ప్రజలకు ఏమి చెప్పినా తమ ఆకారము చూసి నమ్మెదరని తలచి అందరికీ నమ్మపలుకుచున్నారు. కొందరు వారు చెప్పెడి మాటలు నిజమేనేమోనని నమ్మినా, పరమాత్మ మాత్రము ఎవరికీ కనిపించు వాడు కాదు, వినిపించువాడు కాదు. ఎవరు ఏమి చెప్పినా దానికి కొంత దూరము గానే ఉన్నదనీ, వారు చెప్పునది సరికాదనీ తెలియాలి. అంత అగమ్య గోచరమైన పరమాత్మను గురించి బ్రతికియున్నవారు తెలియలేరను సూత్రము తెలియక, తమ గొప్పతనమును చాటుకొనుటకు దేవున్ని చూచినామని, చూస్తున్నామని చెప్పడము విచిత్రము కాదా!

**ఆ ॥ జలదులింకి పోయిన జగములు గ్రుంకినా**
**జడియబోదు దాని జనతమేయో**
**బ్రతుకు చావులనెడి భ్రాంతులు లేనిది**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 112**

**భావము :-** శరీరములో తప్ప బయట ఎక్కడా ఏ వస్తువందు లేని ఓ ఆత్మా! వినుము. ప్రపంచములోని సముద్రములన్నియూ ఇంకిపోయినా, జగములన్నియూ కృంగిపోయి లేకుండా పోయినా, ప్రపంచమంతటికీ ప్రళయమే వచ్చినా, ఉన్న సమస్తము లేకుండా పోయినా, జీవాత్మ నాశనమయినా, ఆత్మ ఉనికి కనిపించకుండా పోయినా, పరమాత్మ మాత్రము ఎల్లపుడుండినట్లే ఉండును. పరమాత్మకు చావు బ్రతుకు అనెడి రెండు సంఘటనలూ లేవు. ఏ దానికీ పరమాత్మ భయపడునది కాదు. అంతటా విస్తరించి అంతా తానై అన్నిటియందు అణువణువునా వ్యాపించియున్న పరమాత్మను ఎవరు గానీ, ఏ ప్రళయము గానీ ఏమీ చేయలేవు. అన్నిటికీ ఆదికర్త, అందరికీ సూత్రధారి అయిన పరమాత్మ చావునది కాదు, పుట్టునది కాదు. త్రిమూర్తులకు గానీ, ఇంద్రాది దేవతలకు గానీ పరమాత్మ తెలియువాడు కాదు.

**ఆ ॥ నాలుగాశ్రమములు నాలుగు యోగముల్**
**నమ్మి జేసినట్టి నరులకెల్ల**
**నచల మిడదు వాటి నమ్మరు చపలులు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 113**

**భావము :-** శరీరములో బుద్ధికి తెలియని విద్యలయినప్పటికీ జంతువు చిన్నతనములోనే నీటిలో ఈదడమును, దూడ పాల పొదుగును గుర్తించడమును, ఐదు సంవత్సరముల చిన్నవయసు మనిషికి పాండిత్యము కలుగడము మొదలగువాటిని తెలియజేయుచూ ఏమీ తెలియని దానివలె నున్న ఓ ఆత్మా! వినుము. మనిషి తన జీవితములో బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమములనెడి నాలుగాశ్రమముల ధర్మములను చక్కగా నిర్విర్తించి, ఆ నాలుగాశ్రమములలో నాలుగు యోగములను నమ్మినట్టి నరులకు అచేలమంటే ఏమిటో తెలియదు. (ఇక్కడ నాలుగు ఆశ్రమ ధర్మములలో లగ్నము కావడమే నాలుగు రకముల యోగములు గానీ, దైవ జ్ఞానమునకు సంబంధించిన బ్రహ్మ, కర్మ, భక్తి యోగములు కాదని తెలియవలెను). యోగములు రెండు రకములనీ ప్రపంచ సంబంధమైన జీవిత దశలకు సంబంధించినవి నాలుగు యోగములు ఒక రకమనీ, పరమాత్మను తెలియుటకు మార్గములైన మూడు రెండవ రకమనీ తెలియ వలెను. నాలుగాశ్రమ ధర్మముల ప్రకారము నాలుగు యోగములు కల్గిన వారికే పరమాత్మ అంటే ఏమిటో దాని ధర్మములంటే ఏమిటో తెలియదు. అటువంటి వారికే తెలియనిది చపల చిత్తులైన మనుషులకు ఏమాత్రము తెలియదు మరియు వారికి నమ్మకము ఉండదు. ఎంతో గొప్ప వారికే తెలియని పరమాత్మ సాధారణ మనుషులకు అదొకటి ఉన్నదనీ కూడా తెలియదు.

**ఆ ॥ కారణంబు శివుడు కార్యంబు జీవుడు**
**కార్య కారణంబు కాని బయలు**
**గాన లేరు జనులు ఘన గురు కృప లేక**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 114**

**భావము :-** జీవుడు ధరించిన శరీరము ఎంత పరిమాణముండునో అంతే లావు అంతే ఎత్తు కల్గి, ఆ శరీర ఆకృతిని కల్గియున్న ఓ ఆత్మా! వినుము. బ్రతికి ఉన్నపుడు తెలియలేని మనుషులు మరణించిన తర్వాత పరమాత్మను తెలియుటకు ఒక అవకాశము గలదు. చచ్చినవాడు తిరిగి పుట్టునను భగవద్గీత వాక్కు ప్రకారము జీవుడు వెంటనే మరొక జాగాలో పుట్టుచుండగా, మరణించిన తర్వాత పరమాత్మను ఎలా తెలియగలమని ప్రశ్నరాక తప్పదు. దానికి సమాధానము ఏమనగా! బ్రతికి ఉన్నపుడే మనిషి తన కర్మను లేకుండా చేయుటకు మొదలు పెడితే కొంతకాలమునకయినా లేక కొన్ని జన్మలకయినా కర్మలేని మరణమేర్పడును. అపుడు తిరిగి జన్మించనవసరము లేక పరమాత్మలోనికి ఐక్యమగును. ఐక్యమయినపుడు పరమాత్మంటే ఏమిటో తెలియగలదు. దానికొరకు ఇప్పటి నుండి కర్మను లేకుండా చేసుకొనుటకు ప్రయత్నించవలెను. కర్మను లేకుండా చేసుకొను పద్ధతి ఒక్క గురువు మాత్రము తెలియజేయగలడు. గురువు సాధారణ వ్యక్తి కానపుడే అసలయిన బోధలు తెల్పి అసలయిన మార్గములో నడుపగలడు.

పనులలో కర్మపుట్టుకొస్తున్నది. కర్మే పనులకు కారణమగుచున్నది. పనికి కారణమయిన కర్మను ఆత్మ ఆచరిస్తూ అనుభవింపజేయుచుండగా కార్యమును జీవుడు అనుభవిస్తున్నాడు. ఈ అసలు రహస్యము ఘన గురువు తప్ప ఎవరూ తెలుపలేరు. ఎవరు తెల్పినా మంత్ర జపములనో విగ్రహ పూజలనో తెల్పుచుందురు. ఆ పనులలో చిక్కుకొనిన కర్మ వీడదు పరమాత్మ మార్గము లభించదు. మనిషి నమ్మిన అన్ని ప్రకృతి పనులను

వదలించి జ్ఞానాగ్ని చేత కర్మను కాల్పించు శక్తి ఒకే ఒక గురువుకుండునని మరువకూడదు. **'బోధకులందరూ గురువులు కారు'** అను సూత్రము ప్రకారము గురువును జాగ్రత్తగా గుర్తించవలెను.

**ఆ ॥** **పూర్ణ బోధకొరకు పురుషుండు బహుజన్మ**
**పుణ్యవశము చేత పుట్టవలయు**
**అట్లు గాకపోతే అతి కష్ట సాధ్యంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **115**

**భావము :-** శరీరములో అంతటా వ్యాపించియుండి కర్మవుంటే చేతిలోనో, కాలిలోనో శక్తి లేకుండా చేసి, అవిటివానిగా కనిపింపజేయుచూ జీవునికి కర్మను అనుభవింపజేయు ఓ ఆత్మా! వినుము. భూమి మీద దేవతల భక్తిగానీ, మంత్రముల జపముల ధ్యాసగానీ లేకుండా పోవాలంటే, పరమాత్మను పొందు మార్గము తెలియాంటే సంపూర్ణమైన బోధ దొరకాలి. అసలుసిసలైన బోధ తెలియాలంటే మానవుడు ఎన్నో జన్మల నుండి జ్ఞానము మీద అభిలాష కల్గి, జ్ఞాన సంస్కారమైన జన్మలు పొందుచూ రాగ, ఎన్నో జన్మల చివరకు పూర్ణబోధ లభ్యమగుటకు కావలసిన గురువు దొరుకును. అట్లు జ్ఞాన సంస్కారములేని వారికి పరమాత్మను చేరుటకు ఉపయోగపడు బోధ దొరకుట చాలా దుర్లభమగును. అటువంటి వారికి వారి సంస్కారము నకు తగినట్లు గురువులు లభించుదురు. వారు చెప్పు బోధలే గొప్పగా కనిపించును.

**ఆ ॥** **బాధలేని బోధ బ్రతికి నన్నాల్లు యీ**
**భావమెరిగి తిరుగు భాగ్యశాలి**
**హరి హరాదులకును యధి కుండు తానయా**
**అఖిల జీవసంగ ఆత్మలింగ.** **116**

**భావము :-** శరీరములో ప్రారబ్ధకర్మను జీవుని చేత అనుభవింపజేయు యమధర్మరాజువై, అహము గలవానికి అగామి కర్మను తలకెక్కించడములో చిత్రగుప్తుడవై చలామణి అగు ఓ ఆత్మా! వినుము. కర్మబాధలను లేకుండా చేయు కర్మరాహిత్య బోధను తెలిసినవాడు అదే భావములో తన జీవితమంతా గడుపును. జీవితమంతా గురువు ద్వారా తెలుసుకొన్న పరమాత్మ మార్గమును అనుసరించుట ద్వారా కర్మంతయూ నశించిపోయి, చివరికి మరణము పొందును. తర్వాత వాడు పుట్టడు కనుక అదే వానికి చివరి మరణము అగును. చివరి మరణము పొంది వాడు అపుడు పరమాత్మలోనికి ఐక్యమై పోవును. అప్పుడు పరమాత్మ ఏమిటో, ఎలాగుందో దాని భావ మేమిటో తెలియును. పరమాత్మ లోనికి చేరువరకు ఎవరికీ పరమాత్మ ఏమిటో తెలియదనుకొన్నాము కదా! పరమాత్మ మార్గము కూడా ఒక్క గురువుకు తప్ప మిగతా బోధకులకు తెలియదన్నాము. మిగతా బోధకులు గురువులవలె నటించవలెననుకొన్నను, వారి నోటినుండి స్వచ్ఛమయిన పరమాత్మ జ్ఞానము రాక దేవతలకు సంబంధించినది మరియు పురాణము లకు సంబంధించిన జ్ఞానము, మతములకు సంబంధించినది మొదలగు విషయములే వచ్చు చుండును. గురువు వద్ద అటువంటి విషయములు కాక జీవుడు ప్రక్క మార్గమును చూడనట్లు బోధలుండును. అటువంటి దేవతాతీత బోధలు తెలిసినవాడు దేవతలకంటే అధికుడై హరి హరాదులను మించి ఉండును.

**ఆ ॥ జనన మరణమనెడి జాడ్యంబు మాన్పంగ**
**మందు యింతకంటె మరియు లేదు**
**దిన్న వారికెల్ల దీరును రోగంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 117**

**భావము :-** మరణములోనూ, పుట్టుకలోనూ జీవుని వెంటవుండి మరణము నుండి పుట్టుక వరకు గుణములను జీవున్ని కర్మ సముదాయమును తీసుకు

వస్తున్న ఓ ఆత్మా! వినుము. జనన మరణమనెడి కర్మతంత్ర రోగమును నయము చేయడానికి సద్గురు బోధయే శరణ్యము. ప్రపంచ కోర్కెలతో నిండుకొన్న దేవతారాధనలను మాన్పించి, కోర్కెలకు అతీతమైన మరియు దేవతల భక్తికి అతీతమైన కర్మనివారణ బోధను మించినది లేదని చెప్పు గురుబోధనుమించినది లేదు. ఏమీ ఏదీ కాని పరమాత్మను తెలియుటకు మార్గమును ఏర్పరచునది సద్గురువు యొక్క కర్మనివారణ బోధయని తెలియవలెను. ఇంతవరకున్న అన్ని ఆరాధనలను వదలి, అన్ని ప్రకృతి జ్ఞానములను వదలి, ఎవరికీ తెలియని పరమాత్మను తెలియుటకు అవసరమైన సద్గురు బోధను తెలియుట వలన చావు పుట్టుకలనెడి రోగము లేకుండా పోయి పరమాత్మలోనికి కలసిపోగలరు.

**ఆ ॥ సద్గురుండు యనెడి మంచి వైద్యుని జేరి**
**పరమ భక్తి యనెడి పత్యముండి**
**దీక్షయనెడి మందు దినవలె మనుజుండు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 118**

**భావము :–** శరీరములో అన్ని పనులు చేయుచూ, ఏ ఒక్క పనిని కూడా నేను చేశానని బయటికి తెలుపక, ఎన్నో విజ్ఞాన పరికరములను కనిపెట్టించు యోచనను ఇచ్చినప్పటికీ ఏమీ తెలియని జీవుడు నేను కనిపెట్టానని చెప్పుకొనుచున్నప్పటికీ, ఊరక చూస్తుండిన ఓ ఆత్మా! వినుము. ప్రజలలో కొంత ఆధ్యాత్మికచింతన కలవారు జ్ఞానమును తెలుసుకోవలెనని గురువులను ఆశ్రయించుచున్నారు. ముఖ్యమైన ఘట్టము ఇక్కడే మొదలవుతుంది. గురువు అంటే బోధలు చెప్పువాడని మాత్రము ప్రజలకు తెలియుట వలన ఎవరు బోధలు చెప్పినా వారిని గురువుగానే నమ్ముచున్నారు. రామాయణము, భారతములను చదివి చెప్పువాడు కూడా గురువుగనే లెక్కించబడుచున్నాడు. తమకేమి తెలియకుండినా ఇతర పుస్తకములలోని

విషయములను చెప్పువారు కూడా గురువులుగనే లెక్కించబడుచున్నారు. ఈ దేవునికిలా పూజచేయవలెనని నియమము చెప్పువాడు కూడా గురువే అగుచున్నాడు. కొందరు తలవెంట్రుకలు, గడ్డము పెంచినంతమాత్రముననే గురువులగుచున్నారు. కొందరేమో కాషాయగుడ్డలు ధరించి, ఆశ్రమములు కట్టించుకొంటే గురువులయిపోవుచున్నారు. మరికొందరు పేరుండి చనిపోయిన వీరబ్రహ్మముగారి ఫోటో పెట్టుకొని ఆయన పేరుతో గురువులయిపోయినవారు కూడా గలరు. జ్యోతిష్యము చెప్పువారు, బావిలో నీటిని గురించి చెప్పువారు, చివరకు లేని వాస్తును గురించి చెప్పువారు కూడా గురువులుగా చలామణి అగుచున్న ఈ కాలములో నిజ గురువు ఎవరనే విషయము ప్రశ్నార్థకము. నిజ గురువును వెదకండి అని చెప్పినప్పటికీ, మాకు ఇంటి దగ్గరుండు గురువును వదలి ఎక్కడోనున్న గురువుతో మాకేమి పని అనువారు కూడా గలరు. మనము వినే బోధ ఏమిటి, ఏ కోవకు చెందినది ఆలోచించిక అప్పటి అనుకూలతను చూచు కొనెడివారు కూడా గలరు. అన్నిటికినీ మించి ప్రపంచ విషయములలో లాభమొచ్చునట్లు కోర్కెలు నెరవేరునట్లు మంత్రమో, తంత్రమో చెప్పు వారిని పెద్ద గురువులుగా ఆరాధించడము నేడు చూస్తూనే ఉన్నాము. బాబాల దగ్గరకు పోతూనే మా సంసారాలు బాగుపడుచున్నాయి, ఆయనను మించిన గురువే లేడు పో! అనువారుండుట కూడా చూస్తూనే ఉన్నాము. ఇంతమంది గురువులలో ఏ ప్రపంచ లాభమును గూర్చి చెప్పని నిజ గురువును ఎవరు లెక్కించెదరు? అందరి గురువుల మార్గములకు అన్యమార్గమయిన నిజ గురువు బోధ ఎవరికి రుచించును? అదియును గాక మిగతా గురువులు కొదవ లేకుండా భూమిమీద అన్ని వేళలా అన్ని కాలములలో ఉందురు. కానీ నిజ గురువు అట్లుకాక కొన్ని వేల సంవత్సరములకు ఒకమారు జన్మ తీసుకొని వచ్చును. ఏ కాలములోనో ఒకప్పుడు భూమిమీదకు వచ్చి తన యదార్థబోధ తెల్పినప్పటికీ, మొదటినుండి పరంపరలుగా వేళ్ళూనుకొన్న

బోధల ముందర అది పెద్దగా ప్రచారము లోనికి రాదు. ఒకవేళ తెలిసినా ఎందరో గురువులు చెప్పినది కాదని ఈయన వేరు మార్గములో చెప్పుచున్నాడు, ఈయన బోధ ఎవరూ విన వద్దండి, చదవవద్దండని చెప్పుకొందురు. స్వార్థ గురువులు నిజగురువు యొక్క బోధలను బయటికి రాకుండా జాగ్రత్త పడుదురు. వాటిని గురించి దుష్ప్రచారము కూడా చేయుదురు. అన్ని విధాల ఎవరూ సమర్థించని నిజ గురువు యొక్క బోధల మీద ఆసక్తి పెంచుకొని వాటిని తెలుసుకొను వాడు ధన్యుడగును. సద్గురు యొక్క బోధలనెడి దైవ విషయములను, భక్తి కల్గి పట్టుదలతో తెలియుట వలన ఏదీ కాని పరమాత్మను చేరుటకు మార్గము ఏర్పడును. దైవమును తెలుసుకోవాలని జ్ఞానమును తెలుసుకొని ఆ మార్గములో నేనున్నామనుకొనువారంతా వారు ఆశ్రయించినది గురువునా లేక బోధకుడినా అని ఒకమారు తిరిగి చూచుకోవలెను. కర్మలను నాశనము చేయు విధానము తమ మార్గములో ఉందో లేదో ఆలోచించుకోవలెను. ప్రపంచ కోర్కెలు ఆయుష్షు ఉండు వరకేనని, వాటివలన సుఖము తప్ప మోక్షము రాదనీ, దైవము తెలియదని తెలిసి నిజ గురువు కొరకు అన్వేషణ చేయవలెను.

**ఆ ॥ దినము దినము తిన్న వారికెల్ల**
**నొంటబట్టి రోగ మొదలగొట్టి**
**కపట జన్మ వ్యాధి కానరాక జేయును**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 119**

**భావము :-** చావులోనూ, పుట్టుకలోనూ సాక్షిభూతుడవై ఆ సమయములో ఏమి జరుగుచున్నదో ఎవరికీ తెలియని రహస్యమును తెలిసిన ఓ ఆత్మా! వినుము. బట్టబయలయి కూడా ఎవరికీ తెలియని పరమాత్మ బోధను గురించి ప్రత్యేకముగా లోకములోనికి వచ్చిన గురువు మాత్రమే తెల్పును.

చెప్పువాడు సామాన్యుడు కాదు, చెప్పబడునది కూడా సామాన్యమైనది కాదు. బోధనుబట్టి బోధించువాడెవడో తెలియవచ్చును. పరమాత్మ అంశతో వచ్చినవాడు వేషములోగానీ, బోధలోగానీ మిగతా ఏ గురువును పోలి యుండడు. ఆయన బోధను గ్రహించి అందరి గురుబోధలవలె ఒక మారు ఉపదేశము ఇప్పించుకొనినంత మాత్రమున సరిపోదని తెలిసి, ప్రతి దినము జ్ఞానము తెలుసుకొంటూ కొన్ని సంవత్సరములు క్రొత్త జ్ఞానమును తెలుసుకొని దానిని నెమరువేసుకొనుచూ ఒంటబట్టించుకొనిన, మనకున్న జన్మల వ్యాధి పోయి మోక్షమను ఆరోగ్యము కల్గును. అదియే పరమ రహస్యమైన అచేలము, అదియే ఎవరికీ తెలియని బట్టబయలు, అదియే జీవుని గమ్యస్థానము. పరమపదమను ఆ గమ్యము చేరువరకు జనన మరణములనెడి ప్రయాణము తప్పదని తెలియవలెను.

**ఆ ॥ ఇట్టి పరమ గోప్య మెవ్వరెరుంగరు**
**ఎరిగినట్టి వారు తిరిగి రారు**
**తిరిగి రాని మరుగు తెలియుట కష్టంబు**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 120**

**భావము :-** చెట్టులో చెట్టు ఆకృతిని పోలియుండి, జంతువులో జంతువు ఆకృతిని పోలియుండి, మనిషిలో మనిషి ఆకృతిని పోలియుండి అనేక శరీరములలో ఆ శరీరములవలె అనేక ఆకారములు కల్గియున్న ఓ ఆత్మా! వినుము. ప్రపంచ సంబంధము లేకుండా పరమాత్మను తెలియునట్టి బోధ తెల్పు గురువు దొరుకుట దుర్లభము. ఒకవేళ దొరికినా మనము తెలుసుకొనుట మరీ దుర్లభము. ఎందుకనగా మాయ అడగడుగునా అడ్డు తగిలి ఆ బోధలకు దూరము చేయు ప్రమాదము కలదు. ఎంతో పరమ గోప్యమైనటువంటి, దుర్లభమైన అతి కష్టమైన బోధను సామాన్యముగా ఎవరూ తెలియలేరు. తెలిసినవారు మరు జన్మలేక తిరిగి పుట్టరు. తిరిగి

జన్మించక పరమాత్మలోనికి ఐక్యమగుటకు కావలసిన రహస్యము తెలియుట ఏటికి ఎదురీతలాంటిది. అయినప్పటికీ పట్టుదలగా తెలిసినవాడు **జీవాత్మ, ఆత్మ, పరమాత్మ** అను త్రైతమును వదలి పరమాత్మ అను ఏకముగా మారి పోవును.

**ఆ ॥ మంగళము మీకు మద్గురు చంద్రమా**
**మంగళంబు మీకు మహి ప్రకాశ**
**మంగళంబు జేసి మరి మరి మ్రొక్కెద**
**అఖిల జీవసంగ ఆత్మలింగ. 121**

**భావము :-** ఒకటవ ఆత్మనయిన జీవాత్మ అను నేను, లెక్కకు మూడవ ఆత్మయిన పరమాత్మను తెలియుటకు రెండవ ఆత్మయిన నిన్ను అడ్డము పెట్టుకొని ప్రతి భావము మొదటిలో ఓ ఆత్మా! అని సంబోధించి చెప్పడము ఒక విధముగా మంచిది కాకున్ననూ తప్ప లేదు. అందులకు క్షమించి ఇపుడు చివరిలో కూడా నీకే చెప్పు విషయము వినుము. నీవు నీ హృదయములో జ్ఞాన ప్రకాశమును కల్గిన చంద్రునివై అన్ని విషయములను నీవే చెప్పి, నా చేత వ్రాయించి, నాయందు గురువుగా యుండి జీవుడయిన నన్ను శిష్యునిగాజేసుకొనిన, నా గురువును నేను శుభకరమయిన ఆఖరు స్థితిని, మంగళకరమయిన మోక్షమును కోరుచున్నాను. కర్పూర హారతిని మంగళ హారతి అనుచున్నారు. కర్పూరము అగ్నికి కరిగిపోయినట్లు నా కర్మ జ్ఞానాగ్నికి కరిగిపోయి, నేను శూన్యమైపోవునట్లు దీవించమని 'మంగళము మద్గురు చంద్రమా' అంటున్నాను. శుభకరము, మంగళకరము శ్రీయుతము అని పోల్చబడు పరమాత్మా! 'నన్ను నీ యందు చేర్చుకొనుటకు' ఈ వ్రాతలుపయోగపడాలని చివరిగా మంగళము చెప్పి మరి మరి మ్రొక్కుచూ ముగించుచున్నాను.

**సమాప్తము**

# ATMA LINGARTHAMU

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక త్రిమత ఆధ్యాత్మిక రచనలు



























































